

# నవల, కథ, కవితల పోటీ

సిపిఎం 21వ అఖిలభారత మహాసభల సందర్భంగా ఉత్తమ సాహిత్యాన్ని ప్రోత్సహించేందుకై నవలలు కథలు కవితల పోటీ నిర్వహించాలని ఆహ్వానసంఘం నిర్ణయించింది. ప్రజా శ్రేయస్సు సామాజిక చైతన్యం కోరే రచయితలు కవులూ ఈ పోటీలలో పాల్గొని ఉత్తేజకరమైన రచనలు పంపి ఈ ప్రయత్నం జయప్రదం చేయాలని కోరుతున్నాము.

నవల: ప్రథమ బహుమతి రూ.30,000/-, ద్వితీయ బహుమతి రూ.20,000/-, తృతీయ బహుమతి రూ.10,000/-
కథ: ప్రథమ బహుమతి రూ.10,000/-, ద్వితీయ బహుమతి రూ.5000/-, తృతీయ బహుమతి రూ.3000/-
కవిత: ప్రథమ బహుమతి రూ.3000/-, ద్వితీయ బహుమతి రూ.2000/-, తృతీయ బహుమతి రూ.1000/-

**నిబంధనలు/సూచనలు:** ◆ కథకు సంబంధించి ఎ4 సైజు కాగితంపై చేతిరాతలో 8 పేజీలు ఉండాలి. డి.టి.పి. 15 సైజు ఫాంట్‌లో ఎ4 సైజులో 5 పేజీలకు మించకూడదు. ◆ మరీ సుదీర్ఘ కవితలు పంపనవసరం లేదు. ◆ నవల ఎ4 సైజు కాగితంపై చేతిరాతలో 250 పేజీలు ఉండవచ్చు. డి.టి.పి. అయితే 15 సైజు ఫాంట్‌లో ఎ4సైజులో 150 పేజీలకు మించకూడదు. ◆ ఇటీవలి ప్రపంచీకరణ విధానాల నేపథ్యంలో ప్రజల జీవితాలలో వస్తున్న మార్పులకు సంబంధించిన అంశాల్ని ఇతివృత్తంగా స్వీకరించవచ్చు. ఇతివృత్తంతో పాటు రచనా శిల్పానికి అధిక ప్రాధాన్యత ఉంటుంది. ◆ అచ్చయినవి, అనుకరణలు, అనువాదాలు పోటీకి అనర్హం. ఆ మేరకు హామీపత్రం రాయాలి. ◆ ఉత్తేజకరమైన పోరాట ఘట్టాలు, జీవితాలు కూడా నవలీకరించవచ్చు. కాని సమకాలీన ప్రపంచం ప్రస్ఫుటంగా ప్రతిబింబించాలి. ◆ గ్రామీణ జీవితం, మహిళలు, అణగారిన తరగతుల గురించి సజీవ చిత్రణలకు స్వాగతం. సామాజిక సమస్యలు, నూతన సమస్యలను కూడా ఇతివృత్తాలుగా తీసుకోవచ్చు. ◆ రచనలపై రచయిత, రచయిత్రులు తమ పేర్లు రాయకూడదు. హామీ పత్రంలో మాత్రమే పేరు, చిరునామా, ఫోన్ నెంబరు, ఇమెయిల్ వివరాలు రాయాలి. ◆ రచనలను కవరుపై నవల, కథ, కవితల పోటీకి అని రాసి **'మహాసభల ఆహ్వాన సంఘం, ప్లాట్ నెం. 21/1, యం.హెచ్. భవన్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, ఆజామాబాద్ ఇండస్ట్రియల్ ఏరియా, హైదరాబాద్- 500 020** చిరునామాకు పంపించాలి. ◆ ఈమెయిల్ **psbhap@gmail.com** ద్వారా కూడా పంపించవచ్చు. ◆ డి.టి.పి.చేసిన వాటిని పిడిఎఫ్, ఓపెన్ ఫైల్ రెండూ పంపించాలి. ◆ ఫలితాలకు సంబంధించి న్యాయనిర్ణేతలదే తుది నిర్ణయం. ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు. ◆ **రచనలు చేరవలసిన చివరి తేది: మార్చి 10.** ◆ గెలుపొందిన నవలలు ప్రచురించడం జరుగుతుంది. ◆ పోటీకి అందిన కథలు, కవితలలో గెలుపొందిన వాటితో పాటు, సాధారణ ప్రచురణకు ఎంపిక చేసిన వాటితో కథ, కవితా సంకలనాలను ప్రచురించడం జరుగుతుంది. ◆ బహుమతి పొందిన కథలు, కవితలను ప్రస్థానం, ప్రజాశక్తి దినపత్రిక ఆదివారం సంచికలలో ప్రచురించడం జరుగుతుంది. ◆ విశాఖపట్నంలో ఏప్రిల్ 14 నుండి 19 వరకు జరిగే మహాసభల సాహిత్య వేదికపై బహుమతులు అందజేయడం జరుగుతుంది. ఇతర వివరాలకు 9490099059 ద్వారా సంప్రదించవచ్చును.

**– మహాసభల ఆహ్వాన సంఘం**

PRSVIM02A156

సాహిత్య
ప్రస్థానం
ఫిబ్రవరి 2015

సంపుటి : 14 సంచిక : 2

# విమర్శల విలువ

సాహిత్య రంగంలో విమర్శ రావలసినంత రావడం లేదనే మాట తరచూ వింటుంటాం. మంచి విమర్శకులకు ఈ మాట కొంచెం కష్టమనిపిస్తుంది కూడా. అయితే సాధారణ సాహిత్య చర్చకు వచ్చేప్పటికీ మాత్రం ఇది ఆలోచించవలసిన అంశమే. ఎందుకంటే ప్రస్థానంతో సహా వివిధ సాహిత్య పత్రికలకు లేదా పేజీలకు రాసేవారు ప్రధానంగా పొగడ్తలకు ప్రాధాన్యమిస్తున్నారు. రచనలకన్నా రచయితలకు అధికంగా స్థలం కేటాయిస్తున్నారు. వారితో తమ సంబంధాలు అనుబంధాలు ఆ సాన్నిహిత్యం వల్ల తెలిసిన వ్యక్తిగత విషయాలు ఏకరువు పెడుతున్నారు. రచననూ రచయితనూ లేదా కవినీ కావ్యాన్నీ విడదీసి చూడలేము గాని ప్రధాన భాగం సృజనకే దక్కడం న్యాయం. రచనను ప్రభావితం చేసిన మేరకే రచయిత జీవితం తప్ప అటు నుంచి ఇటు కాదు. ప్రత్యేకంగా షష్టిపూర్తి, సత్కారం, అవార్డుల బహుకరణ వంటి సందర్భాల్లో నాలుగు మాటలు చెప్పుకోడం సహజం అవసరం కూడా. అంతేగాని రచనను వదలిపెట్టి రచయిత కీర్తనగా మార్చేట్టయితే అప్పుడా పరిశీలన ప్రయోజనం పరిమితమవుతుంది. ఎందుకంటే పాఠకులందరికీ ఆ రచయితతో అంత వ్యక్తిగత పరిచయం వుండకపోవచ్చు. రెండవది వున్నవారికైనా రచన ముఖ్యం తప్ప రచయిత జీవిత దర్శనం కాదు. మూడవది వ్యక్తిగత లక్షణాలూ ప్రవర్తనలూ ఎప్పుడూ ఒకేలా వుండవు కూడా. చివరది వ్యక్తిగతం అనగానే సాహిత్యేతర అంశాలపై చర్చ అధికమయ్యే అవకాశం కూడా వుంటుంది. అందుకే ఈ విషయంలో సమతుల్యత సంయమనం చాలా అవసరం. పరస్పర ప్రశంసల వల్ల సాహిత్యలోకంలో ఒకింత ఉత్సాహం కలగొచ్చు కాని విమర్శనాత్మక దృష్టి రచయితల కలాలను మరింత పదునెక్కిస్తుంది. కనక విమర్శకులే గాక సాధారణ సాహిత్య మిత్రులు కూడా ఆ కోణంలో ఆలోచించడం అవసరం. అప్పుడు తెలుగు సాహిత్య సృజన మరింత సుసంపన్నమవుతుంది.

బొమ్మలు : తుంబలి శివాజీ ♦ జె.వెంకటేష్ ♦ బి. భాస్కర్

## ఈ సంచికలో ...





చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్
ఆర్టీసి కళ్యాణమండపం దగ్గర,
హైదరాబాద్ - 500 020,
ఫోన్ : 040- 27660013, 9490099059
ఫ్యాక్స్, 04-27635136,

ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

# 'కవియు జీవించె'

- డా॥ ఎన్. గోపి

ఏ చౌరస్తాలో చూసినా
ఓ శిలా ప్రతిమ
చరిత్ర ఘనీభవించినట్టు

కాని ఇది కవి విగ్రహం
బతికి బట్ట కట్టినప్పుడు
ఎవరూ పట్టించుకోలేదు
ఇప్పుడు ఈ ఊరికి ఎవరొచ్చినా
ఓ దండ వేసి ఫోటోలు దిగుతున్నారు
అతడు రాసిన మాటలు
ఆ చుట్టు పక్కలవారు విన్నట్టు లేదు
ఒ కాకి మాత్రం చేతిమీద వాలి
ఏవో పరిమళాలను ఆఘ్రానిస్తున్నది.

ఆ పక్క షాపులోనే
అతడు సారాయి కొనుక్కునేవాడు
ఆ సంగతిని గుర్తుచేస్తూ
అమ్మకాలు పెంచుకుంటున్నారిప్పుడు
చివరి రోజుల్లో
అతన్ని నేనే పోషించాననంటూ
సభలో సత్కారం పొందాడొకాయన
కవికి పిల్లలు లేరు
ఎక్కడినుంచి వచ్చిందో ఒకమ్మాయి



ఆయన తనను ఎత్తుకొని
బిస్కట్లు తినిపించాడంటూ
తన అస్తిత్వాన్ని చాటుకుంటున్నది
ఆయన జీవిత చరిత్రను రాసిన
ఒక పెద్దాయన
జంధ్యం తెంపిపారేసి
కులాన్ని వదిలేసిన అతని చిత్రానికి
నామాలు పెట్టి కసి తీర్చుకున్నాడు

ఒకప్పుడతన్ని
తేలిక చేసి మాట్లాడిన వారే
ఇవాళ కారణజన్ముండంటున్నారు
అతడు పూలదండ గురించి
గొప్ప పద్యం రాశాడు
అయితే మరణం తర్వాతే
అది అతని మెడలో పడింది
కవిత్వానికి కాలం కూడా ఒక లక్షణమని
అతని జీవితం నిరూపించింది

## జనవరి నెల పురస్కారాలు



**చీనా**
కథకు: రూ.700/-
రచయిత : సమ్మెట ఉమాదేవి



**రండి బాబూ రండి మా భూములిచ్చేస్తాం**
కవితకు : రూ .500/-
రచయిత : డా॥ ఎన్. ఈశ్వర్‌రెడ్డి

సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి

వ్యాసం : కొవ్వలి నవలల్లోని స్త్రీ, రచయిత : లింగాల రామతీర్థ

ఈ రచయితకు 'కర్లపాలెం రుక్మిణమ్మ' స్మారక పురస్కారం రూ.500 అందజేయబడుతుంది

పాఠకులు తాము చదివిన కవితలు, కథలు, వ్యాసాలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు.
సీనియర్, ప్రసిద్ధ రచయితల రచనలు కాక ఔత్సాహికులను, ఇటీవల రాస్తున్నవారిని
ప్రోత్సహించడమే ఈ పురస్కారాల ఉద్దేశ్యంగా గ్రహించగలరు. - ఎడిటర్

కథ

-అక్కినేని కుటుంబరావు

9493009393

# రైలు వెళ్తోంది



జంగా సంగయ్య గారి మొఖం చేటంతయ్యింది. రైలు బోగీకి అంటించివున్న రిజర్వేషన్ ఛార్టు చూడగానే జంగా సంగయ్యగారి కోల మొఖం సంతోషంతో చేటంతయింది. ఆయన మొహాన్నే చూస్తున్న సంగమ్మగారి మొహం కూడా జల్లెడంతయింది. ఈవిడ మొహం గుండ్రం.

కళ్లు సంతోషంతో వెలిగిపోతుండగా "అయితే మనకి కింద బెర్తు దొరికినట్టేనా" అంది.

అనవిని వేటుబ్రద్ద ఉదగాంగన వలె కళ్ళింతింత చేసి "ఏమిటీ కింది బెర్తా? నువ్వేమన్నా పదహారేళ్ళ బాలాకుమారివను కుంటున్నావా? లేకపోతే నేనేమన్నా నవయువకుడి ననుకుంటున్నావా? రైల్వే వాళ్లకి ఎప్పుడు మన వయసులు 72, 68 అని తెలిసిందో, అప్పుడే వాళ్లు మనకి పైబెర్తులు రిజర్వు చేసేస్తారు. ఎన్నిసార్లు రైల్లో ప్రయాణం చెయ్యలా! ఇవ్వాళేమన్నా కొత్తా?" అని ఇంతెత్తున లేచే సంగయ్యని చూసి-

కణకణమండే నుప్పుల మీద చన్నీళ్లు చల్లినప్పటిలా చప్పున సంతోషం చల్లారిపోగా "మీ మొఖంలో సంతోషం చూసి" అని నసిగింది సంగమ్మ.

"సంతోషమా? సంతోషమే మరి! మన కిందా మధ్యా వున్న నాలుగు బెర్తుల వాళ్లూ యువతీయువకులు వారిద్దరి పిల్లలూను. పెద్ద కష్టం లేకుండానే మనకి కింది బెర్తులిస్తారు. వాళ్లు కూడా మనలాంటి వారైతే మనమే అడగలేం..." అంటున్నాడు సంగయ్య.

"మనలాంటి వారికి కింద బెర్తులివ్వరన్నారుగా"

"ఆ! ఆ మాటా నిజమేలే. సరే యింకా ఆలస్యమెందుకూ ఎక్కుఎక్కు..."

యస్వంత్‌పూర్ ఫ్లాట్‌ఫారం ఎత్తుగానే వుంది. అయితే రైలు బోగీలోకి వెళ్లాలంటే మరో రెండు మెట్లు ఎక్కాల్సిందే. "అమ్మ" "అయ్యా" "అమ్మయ్య" అనుకుంటూ ఇద్దరూ నెమ్మదిగా రైలెక్కి తమ సీట్ల దగ్గరికి చేరేసరికి సాయంత్రం 3.45 అయింది. మరో అరగంటగ్గాని బైల్దేరదు యాశ్వంత్‌పూర్-కాచిగూడ ఎక్స్‌ప్రెస్. నెమ్మదిగా సీనియర్ సిటిజన్స్ ఒక్కొక్కరేవస్తూ పై బెర్తుల వంక దిగులుగానూ కింద బెర్తుల వంక ఆశగానూ చూస్తూ కూర్చుంటున్నారు. మరో 20 నిముషాలు గడిచేసరికి రైల్లో కాస్త సందడి మొదలైపోయింది.

సంగమ్మ నెమ్మదిగా సంగయ్యవంక చూసి ఎదుటి సీట్ల వంక చూపుతూ "వీళ్లు రాగానే... ఎవరూ వచ్చి అడగక ముందే మనం అడిగెయ్యాలి" అంది.

"అంతే అంతే" అన్నాడు సంగయ్య.

వాళ్ళు వచ్చారు. పెద్దపెద్ద పెట్టెలు మూడు సూట్ కేసులు రెండు. అట్టపెట్టెలో మూడు సంచులు పెద్దవి రెండు. చిన్నవి మూడు. భార్యాభర్త సంప్రదించుకుంటూ అన్నీ సర్దేశారు. పెద్ద సంచి సీటుమీదే పెట్టారు. చిన్న సంచి పిల్లలు లాగేసుకున్నారు. అమ్మాయి 7 ఏళ్ళు. అబ్బాయి 5 ఏళ్లు. పిల్లలిద్దరూ తల్లిదండ్రుల్లాగే అందంగా వున్నారు.

సంగమ్మ సాభిప్రాయంగా సంగయ్య వంక చూసింది. సంగయ్య నెమ్మదిగా తలూపి అప్పుడే అన్నీ సర్దికూర్చుని వాటర్

బాటిల్ తీసుకుని సగం బాటిల్ నీళ్లు తాగిన యువకుడితో "మీరూ కాచిగూడకేనా నాయనా?" అన్నాడు.

''అవునండీ కాచిగూడకే'' అన్నాడు మూతి తుడుచుకుంటూ.

సంగయ్యగారు గొంతు సవరించుకుని, మర్యాదగా నవ్వుతూ "మేమిద్దరం పైకెక్కలేం..." అంటూన్న సంగయ్య గార్ని మాట్లాడనియ్యకుండా-

"అయ్యో మీరు పెద్దవారు. మీరు పైకెక్కడం ఎందుకు? మీరిద్దరూ హాయిగా ఈ కింద రెండు బెర్తుల మీదా పడుకోండి. మేమిద్దరం పైకెళ్తాం" అన్నాడు.

సంగమ్మ, సంగయ్య సంభ్రమంగా ఒకర్నొకరు చూసుకుని నిట్టూరుస్తూండగా-

''పిల్లలిద్దరూ ''ఆ- పైకి మేమెళ్తాం" అన్నారు.

తల్లి అందుకుని "ఆ.. వెళ్తారు. నిద్రలో అక్కడ్నించి పడితే" అంది.

మధ్య బెర్తు చూపించి "మరిక్కడ్నుంచి పడితే" అంది పాప. "నువ్వన్నా చెప్పు నాన్నా" అన్నాడు బాబు.

తల్లిదండ్రులిద్దరూ ఒకర్ని చూసి ఒకరు మురిపెంగా నవ్వుకున్నారు.

ఆ నవ్వులు చూసి సంగమ్మ సంగయ్యలు ఆశ్చర్యపోయారు. ఆ యువ దంపతులకి పెళ్లయ్యి కనీసం 8,9 ఏళ్ళయియుంటుంది. చలాకీగా వున్న ఇద్దరు పిల్లలున్నారు. వాళ్లెంత అల్లరైనా చెయ్యగలరు. అయినా, ఇంకా ఒకర్నొకరు చూసుకుని నవ్వుకుంటున్న భార్యాభర్తలు. ఆశ్చర్యం కాదా మరి!

పిల్లలిద్దరూ తల్లిదండ్రుల మధ్య చేరి చిన్న డబ్బాలో నుంచి తీసిన "కారప్పూస" "చెక్కలూ" పరపర నమల్డం మొదలెట్టారు. బండి కదిలింది.

సంగమ్మ ఆశ్చర్యంతో సంగయ్యకేసి చూస్తే-సంగయ్య ఆందోళనగా సంగమ్మకేసి తిరిగి ఆ పిల్లలకేసీ చూశాడు.

నేటి భారతావనిలో అందులోనూ సిటీల్లో పెరుగుతూ వేలకి వేలు కొండకచో లక్షలకి లక్షలు ఫీజులు కడ్తూ చదువు(?) కొంటున్న పిల్లలు- కోట్లాది రూపాయలు వాణిజ్య ప్రకటనలకే చెల్లిస్తూ కోట్ల రూపాయల్తో వ్యాపారం చేస్తూన్న కార్పొరేట్ కంపెనీలు తయారు చేసే 'లే'లు 'కుర్‌కురే'లూ తినకుండా అమ్మలూ అమ్మమ్మలూ రెక్కలు ముక్కలు చేసుకుని వండే చెక్కల్తో, కారప్పూసలో తింటున్నారంటే... మమ్మీ డాడీల్ని పట్టుకుని 'అమ్మా' 'నాన్న' అంటున్నారంటే ఎవరన్నా నమ్ముతారా! నమ్మతగిందేనా? మన స్వర్ణ నవ్య భారత సంస్కృతి ఏమైపోతోంది! వెనక్కెళ్తున్నామా? ముందుకా?



ఈ పిల్లల్ని చూసి మరికొంతమంది పిల్లలు యిలాగే ఇంట్లో వండే అరిసెలూ, గారెలూ, సకినాలో తింటే దేశ దేశాల్నుంచి ఎంతో శ్రమపడి భారతదేశమ్మీద ఆశతో వచ్చే పిజ్జాలూ, బర్గర్లు కేసీలూ, కేఎఫ్‌సీలు అవి తయారు చేసే కంపెనీలూ, అమ్మే ఏజన్సీలూ, ఇంటింటికి తిరిగే పిజ్జా పిల్లగాళు ఏమైపోవాలి? పైగా ఇలాంటి జంక్‌ఫాస్ట్ ఫుడ్‌ల మీదే ఆశతో ఆధారపడి పెట్టుకున్న కార్పొరేట్ హాస్పిటల్స్, కోట్లు కుమ్మరించి తెచ్చి పడేసిన రకరకాల టెస్టుల మెషిన్స్... యివన్నీ ఏమైపోవాలి. పిల్లలూ యువకులూ ఇంటి తిండి కలవాటు పడ్తే యింకేమన్నా వుందా? ఎన్ని లక్షల కోట్ల వ్యాపారాలు కుప్ప కూలిపోతాయ్.

ఆలోచిస్తే ఇది కనపడేంత చిన్న విషయం కాదు అన్పించింది సంగయ్యకి. పిల్లలిలా పాడైపోతుంటే పట్టించుకోని ఆ తల్లిదండ్రుల కేసి చూసి ఈ సంగతేదో తేల్చుకోవాల్సిందే ననుకున్నాడు.

''నీ పేరేంటబ్బాయ్'' అన్నాడు.

"నా పేరు విజయ్ అండీ" అన్నాడు తండ్రి.

"నా పేరు చెప్పనా తాతగారూ" కొంటెగా నవ్వుతూ కారప్పూస నవుల్తూ అడిగింది పాప.

"చెప్పు తల్లీ" అంది సంగమ్మ.

"మల్లి" అని తెల్లగా నవ్విందా పిల్ల. మల్లెల వాసన గుప్పుమంది.

"నీ పేరేంటి నాన్నా" అడిగాడు సంగయ్య బాబుని చూస్తూ.

"దయానిధి" బోగీ అంతా చల్లటి గాలితో నిండింది.

తల్లివంక చూసిన సంగమ్మ గారితో-

"నా పేరు సుహాసినండీ" అంది మొఖమంతా వెలుగుని నింపిన నవ్వుతో-

సంగమ్మ సంగయ్య వంక చూసింది.

సంగయ్య సంగమ్మ వంక చూశాడు.

ఇద్దరికీ కింది బెర్తులు దొరికిన దానికన్నా సంతోషంతో, ఆనందంతో మనసు నిండిపోయింది. విజయ్, సుహాసినిలు సరే. పిల్లల పేర్లు...ఆన్, సూన్, సేన్, లేదా డోక్యా, మేక్యా, పూక్యా, ఏహ్యా లాంటి పేర్లు గాక మల్లి, దయానిధి లాంటి పేర్లెవరన్నా పెట్టుకుంటారా. ఈ పిల్లలేమో మమ్మీని అమ్మా అనీ, డేడీని నాన్న అని పిలవడం, నిమిషానికి నాలుగుసార్లు వస్తున్న 'థండీవాలా కూల్ డ్రింక్స్' వంక మొఖమన్నా తిప్పకుండా

ఇంటినుంచి తెచ్చుకున్న నీళ్లు తాగడం. ఈ సంగతేదో తేల్చుకోకపోతే సంగయ్యగారి శేషజీవితమంతా ఈ అశేష ప్రశ్నలు మదిని వేధిస్తాయి. అందుకే–

"చాలా సామాన్లతో ఎక్కారు హైదరాబాద్‌కి బదిలీ అయ్యిందా నాయనా" అన్నాడు సంగయ్య.

"మా సంగతి చెప్తాగాని మీరిక్కడుంటారా? హైద్రాబాద్‌లోనా?" అన్నాడు విజయ్.

"మేము హంసలదీవి దగ్గరుంటాం బాబూ. ఇక్కడ మా మనమరాలి దగ్గర కొచ్చాం. దానికి కొత్తగా పెళ్లయింది. ఆ అబ్బాయి కూడా యిక్కడే. ఇద్దరూ సాఫ్ట్‌వేర్‌లే!"

"ఎన్నాళ్లయింది మీరొచ్చి"

"వారం"

"మరప్పుడే వెళ్ళిపోతున్నారే. ఓ నెలన్నా ఉండకపోయారా?"

సంగమ్మ ఉక్రోషంగా మొదలెట్టింది. "నేనేంటి నాయనా! ఆర్నెల్లన్నా వుండాలనుకుని వచ్చాం."

"మరి"

"ఏం చెప్తాం నాయనా. ఈ నరకంలో ఉండలేక"

"అదేంటి? మనవరాలన్నారు? ఓహో... ఆ అబ్బాయికి మీరుండటం ఇష్టం లేదా?"

"ఛ ఛ! ఆ అబ్బాయి దేముడు." అన్నాడు సంగయ్య.

"బాగా చెప్పారు. నిజంగా దేముడే. మా కసలు ఈ వారంలో ఒక్కసారీ కన్పడలా." అంది సంగమ్మ.

"ఏదన్నా ఊరికి టూర్‌కీ..."

"టూరూ లేదు పాడూ లేదు. మా మనవరాలికి పగలు ఆఫీసు. అతనికి రాత్రి ఆఫీసు. ఇద్దరూ తుఫాన్ ఎక్స్‌ప్రెస్‌ల్లా... చిన్న స్టేషన్స్‌లో అర నిమిషం ఆగి పరుగెత్తుతురయే అలా... ఇంటికి రావడం గగనం. ఎప్పుడొస్తారో ఎప్పుడు తింటారో, ఎప్పుడు పడుకుంటారో అసలు వాళ్ళిద్దరూ కలవడం కుదరదు. ఆ మాత్రం దానికి వీళ్లకి పెళ్లెందుకు? ఎప్పుడు చూసినా ఆ తొడల మిషను' లోకి చూస్తూ... నెల తిరిగే సరికి లక్షలు సంపాదిస్తారా! అదంతా ఆ మాల్స్ వాళ్ళకీ, హోటల్స్‌కి సమర్పిస్తారు. ఎందుకులే ఇదంతా చూస్తూ మేమీ బాధపడలేం అనుకుని మా హంసలదీవికి బైల్దేరాం"

విజయ్, సుహాసినిలు ఒకర్నొకరు చూసుకుని నవ్వుకున్నారు. పిల్లలిద్దరూ 'వైకుంఠపాళి' ఆడుకుంటూ కేరింతలు కొడ్తున్నారు.

"మీ సంగతేమిట"ని అడగబోతున్న సంగయ్యని చూసి.

"మా సంగతేమని చెప్పమండీ. మీ మనమళ్లలాగే నేనూ ఎం.ఎస్‌సి లో పనిచేసేవాడిని."

"ఇప్పుడు చెయ్యడం లేదా?"

"నిన్నే మానేసా"

"అవునా? అదిసరేగానబ్బాయ్. మీరంతా ఆ కంప్యూటర్ మీద కొట్టుకుంటూనో, మాట్లాడుకుంటోనో వుంటారు. ఒక్కోసారి ఆఫీసుక్కూడా వెళ్ళరు. రాత్రీ పగలూ తేడా లేకుండా ఇంట్లోనే పని చేస్తూ వుంటారు. నా కర్థంగానిదేంటంటే– మేం పనులు చేసేటప్పుడు చిన్న చిన్న వర్క్‌షాప్పుండీ పెద్ద పెద్ద ఫ్యాక్టరీల వరకూ ఏవో వస్తువుల్ని తయారు చేసేవి. మీరింత పెద్ద పెద్ద అద్దాల మేడల్లో కూచుని మాటల్తో నడిపిస్తారు. కంప్యూటర్ తప్ప మరో మెషనూ వుండదు. బైటికొచ్చే వస్తువూ ఉండదు. ఏమిటీ మాయాజాలం. వస్తువు లేకుండా ఏమి అమ్ముతారు? ఏమి కొంటారు? లాభం ఎక్కడ్నుంచొస్తుంది? నాక్కాస్త చెప్పు" అన్నాడు సంగయ్య.



"ఒక్క మాటలో చెప్పాలంటే మాటలమ్ముతాం. మాటలు కొంటారు. లాభాలన్నీ పేవర్ల మీదుంటాయ్. అంతే పెదనాన్నగారూ" అన్నాడు విజయ్.

"హు!" అని ఓ దీర్ఘ నిశ్వాస విడిచి "సరేనయ్యా. నువ్వుద్యోగం ఎందుకు మానేశా.. ఏం చేద్దామని" అడిగాడు సంగయ్య.

"నేను పని చేసేది ఒక అమెరికన్ కంపెనీలో. మనకి రాత్రి వాళ్ళకి పగలు. ఆ పగటి పూట వాళ్ళడిగే ప్రశ్నలకి నా రాత్రుళ్ళన్నీ సమాధానాలు చెప్పటంతోనే సరిపోతోంది. ఈ బాధ పగవాళ్ళక్కూడా వద్దనిపించి మానేశాను. అంతేగాదు మీరన్నట్లు మనం చేసే పని నుంచి ఏదో ఒక వస్తువుని సృష్టిస్తే ఆ ఆనందమే వేరు కదా! అందుకే... అమెరికాలో ఉండే అమెరికన్ల సమస్యలన్నీ తీర్చే పని మానేసి ఏదన్నా ప్రొడక్టివ్ పని చెయ్యాలనిపించింది. అందుకే బైల్దేరా" అన్నాడు విజయ్.

"మరి అమ్మాయి" అన్నాడు సుహాసిని వైపు చూపించి.

"ఆవిడది మరొక సమస్య... ఆమే చెప్తుంది" అని ఆవిడ వంక చూశాడు నవ్వుతూ.

"నేను ఎంఏ, పిహెచ్‌డి చేశాను. సైకాలజీ... నాకు మొదట్నుంచీ పెద్దపెద్ద ఉద్యోగాలూ పెద్ద పెద్ద బాధ్యతలూ యిష్టం లేదు. సాధ్యమైనంత చిన్న పనులు, బాధ్యతలూ యిష్టం.

అందుకనే ఒక స్కూల్లో పిల్లలకీ తల్లిదండ్రులకీ కౌన్సిలింగ్ యిచ్చే పని తీసుకున్నా. పిల్లలతో ఆడుతూ, పాడుతూ పనిచెయ్యొచ్చని స్కూలు టైమింగ్స్ కాబట్టి మిగిలిన టైమంతా నా చేతిలో వుంటుందనీ ఆశపడ్డాను. దిగితేగాని లోతు తెలవదని పెద్దలెందుకంటారో అర్థమయ్యేసరికి నేను కుత్తుక బంటి లోతులో మునిగిపోయానని తెల్సింది" సుహాసిని మొహంలో నీలినీడలు కమ్ముకున్నాయ్.

"స్కూలు పిల్లల్తో నీకంత సమస్య లేముంటాయ్యమ్మా" అంది సంగమ్మ. ఆమె గవర్నమెంటు స్కూళ్లల్లో టీచర్‌గా హెడ్ మిస్ట్రెస్‌గా పనిచేసి ఉత్తమ ఉపాధ్యాయునిగా అవార్డులు తీసుకుని రిటైర్ అయింది.

"సమస్యలు నాకు కాదమ్మా! నేను పని చేసే స్కూల్లో పిల్లలకి. వాల్లని కన్న తల్లిదండ్రులకీ. వాళ్ళకి కౌన్సిలింగ్ యిచ్చేసరికి నా జవసత్వాలుడిగిపోతున్నాయ్. రాత్రీ పగలూ ఆ పిల్లలు వారి సమస్యలూ వాటిని పట్టించుకోని ఆ తల్లిదండ్రులూ.. వీటన్నిటితో నాకు పిచ్చెక్కేలా వుంది. అందుకే..."



"ఏమిటమ్మా... ఆ సమస్యలు. ఉదాహరణకి రెండు చెప్పు" అంది సంగమ్మ.

'ఏడెన్మిది తరగతుల పిల్లలు యూనిఫారంతో వెళ్ళి కాఫీడేల్లో హుక్కాలు తాగుతారు. మీకు తెలుసా?"

"హుక్కాలా?" సంగమ్మ సంగయ్య లిద్దరూ ఒక్కసారి హులిక్కిపడ్డారు.

"ఆ! హుక్కాలు"

"అంత చిన్న పిల్లలకి హుక్కాలిస్తొంటే ప్రభుత్వాధికారు లేంచేస్తున్నారు"

"హుక్కాకి లైసెన్సిస్తున్నారు. లైసెన్సుంటే ఏ వయసు వారికైనా హుక్కా యివ్వొచ్చు"

"ఏడెనిమిది తరగతుల పిల్లలకేకాదు, రెండుమూడు తరగతుల పిల్లలు రావడం లేదుగాని వస్తే వాళ్ళకూడా యివ్వచ్చు."

ఇద్దరూ ఒకరి మొహాలొకరు 'ఇంత అన్యాయమా' అన్నట్టు చూసుకున్నారు. మాట పెగల్లల్లా.

"హుక్కాతోపాటు వాళ్ళకి సిగరెట్లు అలవాటవుతున్నాయ్. ఆడా మగా తేడా లేకుండా పిల్లలంతా ఉబలాటంతో ఎలా వుంటుందోననే ఉత్సుకతతో మొదలెట్టి అలవాటుగా మారిపోతోంది. అక్కడే మాటు వేసే డ్రగ్స్ మాఫియా నెమ్మదిగా పిల్లలకి మాదక ద్రవ్యాల్ని అలవాటు చేస్తున్నారు. తొమ్మిది, పది తరగతుల కొచ్చేసరికి ఇంకొంత పెద్దవాళ్ళవుతున్నారుగా నీలి చిత్రాలు అందుబాటులో వుంటున్నాయి. వీళ్ళు "ప్రాక్టికల్స్" లోకి దిగుతున్నారు'' విషాదంగా చెప్తున్నా సుహాసినిని నిర్ఘాంతపోయి చూస్తున్నారు సంగమ్మ, సంగయ్యలు.

"ఎంత ఘోరం!" అన్నాడు సంగయ్య.

"అసలు ఘోరం యింకా వుంది. ఈ విషయాల్లో పిల్లలకి ఆరోగ్య సమస్య, సాంఘిక సమస్య, నీతి సమస్య, భవిష్యత్ సమస్య, వైయక్తిక విలువలు... వీటన్నిటి గురించి చెప్పి, తల్లిదండ్రులని పిల్చి వాళ్ళ పిల్లల గురించి చెప్తోంటే వాళ్ళిచ్చే సమాధానాలు విని నాకు పిచ్చెక్కుతోంది."

"ఏమంటారు వాళ్ళు."

" మా పిల్లలకి అలాంటి అలవాట్లు లేవని బుకాయిస్తారు కొందరు. మీ స్కూల్లో చేరాకే అలవడ్డాయి అంటారు మరికొందరు. పిల్లలు అన్నీ నేర్చుకోవాలనుకుంటారు. వాళ్ళే మానేస్తార్లే, మీరు ప్రెస్ చెయ్యకండి అని మాకే చెప్తారు. "

"సెక్స్ విషయం చెప్తే - ఈ రోజుల్లో యివన్నీ కామన్ అండీ! లెట్ దెం ఎంజాయ్ అంటున్నారు. నమ్ముతారా?"

''తలిదండ్రులకే లేని విలువలు, పిల్లలకేం నేర్పుతాం. మా దగ్గర పదో క్లాసు పిల్లలకి తాగుడు మామూలు విషయంగా మారింది. ఒక కుర్రాడికి వాళ్ళింట్లోకి వెళ్ళడానికి ప్రత్యేకంగా ఒక గుమ్మం వుంది. దానికి వాడు తాళం వేసుకుని ఎప్పుడెళ్తాడో, ఎప్పుడొస్తాడో తల్లిదండ్రులకి తెలవనక్కర్లా. 'పిల్లలకా మాత్రం స్వేచ్ఛ వుండాల్లెండి. ఇంత సంపాయిస్తున్నాం. పిల్లలు ఎంజాయ్ చెయ్యడానికొబోతే ఎందుకీ తపన' అన్నాడు తండ్రి. వీళ్లకి ఏ విలువల గురించి చెప్తాం. అతను పెద్ద అవినీతి చక్రవర్తిగా పేరుమోసాడు. భార్య ఎప్పుడూ తాగి క్లబ్బుల్లో పడిపోతూ ఉంటే డ్రైవర్ మోసుకొచ్చి బెడ్ రూంలో పడేస్తాడట. రాత్రయితే చాలు పార్టీల్లో మునిగిపోయి సినిమా తారలతో పోయే భర్తకివేమీ తెలియవో, తెలిసినా లెట్ హర్ ఎంజాయ్ అనుకుంటాడో తెలియదు. సొంత పిల్లలు సర్వనాశనమైనా పట్టించుకోరు" సుహాసిని మొఖంలోని నీలిమబ్బులు కళ్లద్వారా వర్షించడం మొదలైంది.

"నీ మోహానికి విషాదం అంత శోభస్కరంగా లేదు.

కళ్లు తుడుచుకో సుహాసినీ" అని భార్యతో అని సంగయ్యగారితో "అందుకే మేమిద్దరం ఒక నిర్ణయం తీసుకున్నాం పెదనాన్నగారూ!" అన్నాడు.

"ఏమిటది?"

"వీధిలో కెళ్తే వాతావరణ కాలుష్యం. పనిచేసే చోటా భావకాలుష్యం. తినే తిండిలో కాలుష్యం... పిల్లల పెంపకంలో అవినీతి కాలుష్యం... ఈ కాలుష్యాలన్నిటికీ దూరంగా ఆరోగ్యంగా తాగేనీటిలో, తినే తిండిలో, పీల్చేగాలిలో, పిల్లల బాల్యంలో, మనసమయంలో, అన్నిటా ఆరోగ్యకరమైన వాతావరణం సృష్టించుకోవాలి. అందర్నీ మార్చలేమని అర్థం అయిపోయింది. మేమన్నా మారాలనుకుంటున్నాం. ఇద్దరం ఉద్యోగాలకి రాజీనామా లిచ్చేశాం. మా ఊరి దగ్గర కొంత పొలం తీసుకున్నాం. సేంద్రియ ఎరువుల్తో మాక్కావల్సినవి మేమే వండించుకుంటాం. మిగిలినవి ఇతరుల కిస్తాం. మా పిల్లల్ని ఆ 7-8 లక్షలు తీసుకుని పాడుచేసే స్కూళ్లనించి కాపాడి వారి బాల్యాన్ని వాళ్ళకిచ్చి, వాళ్ళక్కావల్సిన చదువూ జ్ఞానం మేమే ఇస్తాం." అందమైన భవిష్యత్తుని కలగంటున్న విజయ్‌ని నేలమీదికి దించే ప్రయత్నంగా-



"ఊళ్ళో కూడా నువ్వనుకుంటున్నంత కాలుష్యరహితంగా లేవు. పైగా నీళ్ళూ దొరకటంలా, కరెంటుండదు. నగరాల్లో మీరు పొందే ఏ సౌకర్యమూ అక్కడ వుండదు..."

"అక్కర్ల. అందుకే మేం ఇక్కడ మా ఫ్రిజ్‌లూ, టీవీలూ, ఏసీలూ అన్నీ అమ్మేశాం. మేం ఉండబోయేది మా పొలం గట్టుమీద మేం వేసుకునే పాక. దానిలో టీవీ, ఫ్రిజ్ లాంటివేమీ ఉండవు. మట్టికుండల్లో నీళ్ళు తాగుతాం. ఏ పూట వంట ఆ పూట చేసుకుని తింటాం. మా పిల్లలు టీవీ చూడరు. చెట్లెక్కుతూ పొలంగట్ల మీద పరుగులు తీస్తూ ఆటలాడుకుంటూ రాత్రిళ్ళు వెన్నెల్లో తడుస్తూ మేం చెప్పే కథలు వింటూ నక్షత్రాల్ని లెక్క పెడ్తూ నిద్రోతారు. మాక్కావల్సిన కరెంటు కోసం మేం 'సోలార్ విద్యుత్తు' మీద ఆధారపడ్తాం. మా పొలంలో పెద్ద చెరువు తవ్వుకుంటాం. మేం సాధ్యమైనంత వరకూ ప్రభుత్వం మీదా, వారి శాఖల మీదా, అధికారుల మీదా ఆధారపడకూడదనుకుంటున్నాం.మాకోసం మేం బతకాలనుకుంటున్నాం. ఎక్కడో ముక్కూ మొహం తెలియని వారికి సేవలు చేస్తూ బతకడంకన్నా, మనసకి మనం, మన పిల్లలకి మనం. మన చుట్టూ వున్న మన జనానికి మనం ఎంత ఉపయోగపడ గలవో చూద్దామనుకున్నాం" అంటూ విజయ్ కంటున్న ఆ సుందర స్వప్నాన్ని లీలగా ఊహించగానే సంగయ్యగారికి మనసులో నుంచి ఒక రకమైన దుడుకు మొదలై శరీరమంతా వణికింది. ఆయనకున్న ప్రపంచజ్ఞానం, ఆయన్ని భయపెట్టింది. నడుస్తున్నదానికి విరుద్ధంగా ఆలోచించిన, ఆచరించిన వారిని బతకనివ్వకపోవడం ఆయన ఊహ తెలిసిన దగ్గర్నుంచీ చూస్తూనే వున్నాడు. వ్యక్తితో మొదలైన తిరుగుబాట్లు శక్తిగా ఎదుగుతాయనీ, ఆ వ్యక్తుల్నీ, శక్తుల్నీ అణచడానికే ఈ ప్రభుత్వాలున్నవనీ ఆయన జీవితానుభవం ఆయనకి నేర్పింది.

తన మానాన తాను బ్రతుకుతానంటే ఊరుకుంటుందా ఏ ప్రభుత్వమైనా? ఎందుకంటే విజయ్‌ని చూసి మరో అజయ్, సుజయ్, సుహాసినిని చూసి మరో సులోచన, అరుణ అలా బ్రతకడానికి సాహసిస్తే ఈ కార్పొరేట్ కల్చరంతా సౌధాలన్నీ పేకమేడల్లా కుప్పకూలవా? అప్పుడు ఈ జనమంతా దేశద్రోహులు కారా? అనే ఆలోచనతో ఆయన ముఖం పాలిపోయింది.

దేశ సంపదలు, అడవులు, సహజ ఖనిజాలు, భూములు, నదులు, సముద్రాలు, మానవ వనరులతో సహా అన్నీ కార్పొరేట్లకు అమ్ముకోవాలనుకునే ప్రభుత్వాలు, అలా అమ్మడానికి వీల్లేదు. అవన్నీ దేశసంపద, దాని వారసులం మేం అనే ప్రజలనేం చేస్తాయో సంగయ్యకు తెలుసు.

సంగయ్య ముఖంలో మార్పులు గమనిస్తున్న సంగమ్మ మంచినీళ్ళ సీసా తీసిచ్చి "తాగు" అంది. ఆయన ముఖంలో ప్రతి రంగూ, ప్రతి ముడతా ఆమె యిట్టే చదివెయ్యగలదు.

"అట్టా భయపడే ఇట్టా చేసుకున్నాం. పిల్లలు ధైర్యంగా ఉన్నారు. మజ్జలో నువ్వు వణకమాక. వాళ్ళు బాగుండాలని దీవిద్దాం." అంది మెల్లిగా.

సంగయ్య నెమ్మదిగా సంగమ్మ మొహం కేసి చూశాడు. ఆయన మొహం మెల్లిగా తేట పడింది. ధైర్యంగా ఎదుటనున్న విజయ్ కుటుంబాన్ని చూశాడు.

పిల్లలిద్దరూ ఆడి ఆడి అలిసి, తల్లినానుకు నొకరూ, తండ్రినానుకునొకరూ, నిశ్చింతగా నిద్రపోతున్నారు.

సుహాసిని మొహం నిండా నవ్వులు పండించే వైపుకి రైలు వెళ్తోంది.



## కండ్లూ వాళ్ళవే.. వేళ్ళూ వాళ్ళవే...!

– పురిమళ్ల సునంద
9441815722



అది ఏ జాతరా కాదు
జరిగింది మూగజీవాల బలికాదు
ఇరువర్గాలు పోరాడే రణభూమి కానేకాదు
వారికి జన్మవైరము ఎవరితోనూ లేదు
అయినా మరుభూమిని తలపిస్తున్న పరిసరాలు
గుండెల నిండా గాయాలతో రోదిస్తున్న గోడలు
వరదలా పారిన రక్తపుటేరులు
రక్తం మడుగులో తేలిన పుస్తకాలు, బ్యాగులు
మౌనసాక్షులుగా... విరిగిన తలుపులు, కిటికీలు
తాలిబన్ తూటాలకు నేలకొరిగిన పసిదేహాలు
కన్నీళ్ళను ఆపుకోలేని హృదయ విదారక దృశ్యాలు
ఇంకా... ఆ ప్రాంగణంలో ప్రతిధ్వనిస్తూనే ఉన్నాయి
చిన్నారుల నిస్సహాయ ఆఖరి ఆర్తనాదాలు

పసితనం వీడని కసుగాయలపై చేసిన దాడి
దేనికి పరాకాష్ట.....?
మతోన్మాద వికృత రూపమా...?
విస్తరిస్తున్న ఉగ్రవాద ఉన్మాదమా..?
మహా విషాదానికి తల్లడిల్లిన ప్రపంచ దేశాలు
మాయమూ పోతున్న మానవతను
వేలెత్తి చూపుతున్న అనేక ప్రశ్నలు !

కన్నవాళ్ళ ముద్దు మురిపాలను మూటగట్టుకొని
విద్యా, జ్ఞానార్జనకై వచ్చిన విద్యార్థుల లోకమది
పుస్తకాలతో కుస్తీపట్టడం, నేస్తాలతో దోస్తీకట్టడం
ఆటపాటలతో గురువుల పాఠాలు నేర్చుకోవడం తప్ప
లోకం పోకడ తెలియని ముగ్ధమందారాల తోట అది
పచ్చని ఆ ఉదయం రక్తచందనం అవుతుందని
బడిగంటే మృత్యుగంటై పిలుస్తుందని
పగనిండిన విషనాగులు పాశవికంగా కాటేస్తాయని

అర్థం చేసుకోలేని అమాయకపు బాల్యమది
మత కలహమూ కాదు మరో దేశము కాదు
పాలుపోసి పెంచిన తాలిబన్ భూతం
దేశాన్ని రక్షించే రేపటి తీరాన్ని
పాపం పుణ్యం ఎరుగని పసిడిపూల బాల్యాన్ని
అమానుషంగా చిదిమేసిన ఉగ్రవాదం
పాము తన గుడ్లను తానే మింగినట్టు
జిహాద్ పేరిట – జాతిని మతాన్ని నిర్దయగా కాలరాస్తున్న నీచత్వం
నాడు ఆడపిల్లల చదువుకై ఆరాటపడిన మలాలాపై హత్యాయత్నం
నేడు పెషావర్ సైనిక పాఠశాలలో సాగించిన దారుణ నరమేధం

ఉగ్రవాదులకు ఉప్పందించే అగ్రరాజ్యాలు
విద్రోహులకు ఆశ్రయమిచ్చే దేశాలు సంస్థలు
ఇప్పుడు జరిగిన ఘోరకలి నుంచి
నేర్చుకోవాల్సిన గుణపాఠం ఒక్కటే...
మౌనంగానో, మద్దతుగానో నిలబడే కండ్లు వాళ్ళవే
అయినప్పుడు
ఆ కండ్లను పొడిచే వేళ్ళూ వాళ్ళవే అవుతాయని !

---

## సాయం సంధ్య

పి. అనంతరావు
9640708826



సూర్యచంద్రులు ఆకాశరంగస్థలంమీద
ఏకపాత్ర అభినయం చేస్తున్నారు
ప్రజలందరికీ వెలుగునిస్తున్నారు
ఒకరు ఉదయ సంధ్యలో
మరొకరు సాయం సంధ్యలో
నిష్క్రమిస్తున్నారు

రాజకీయ నాయకులు అన్ని వెలుగుల్ని
సొంతం చేసుకొని
అంధకారాన్ని మాత్రమే వ్యాపింపచేస్తున్నారు
ప్రజలకిక ఎప్పుడూ
సాయంసంధ్యకాలమే !

# తెలుగు అధికార భాషా చట్టం - అమలు

- డా॥ సి.సరళాదేవి
9505804261




**భారత రాజ్యాంగంలోని 345వ అధికరణ తమతమ ప్రాంతీయ భాషలను అధికార భాషలుగా స్వీకరించడానికి రాష్ట్రాలకు అధికార మిచ్చింది. 1906లో సర్‌జార్జి గ్రియర్‌సన్ సంపాదకుడిగా వెలువడిన 'లింగ్విస్టిక్స్ సర్వే ఆఫ్ ఇండియా' అన్న 11వ సంపుటలో 175 భాషలు, 544 మాండలికాల సర్వే కనబడుతుంది. భారతదేశంలో 1652 భాషలున్నట్లు భాషావేత్తల అభిప్రాయం. భారత రాజ్యాంగం 8వ షెడ్యూలులో మొత్తం 18 భాషలకు మాత్రమే అధికార భాషలుగా గుర్తింపు లభించింది.**

మనది ప్రజాస్వామ్యం. ప్రజాస్వామ్యంలో పరిపాలన ప్రజల భాషలో జరగడం ఉచితం. ప్రజలకు అర్థంకాని, అందుబాటులో లేని పరభాషలో జరగడం అనుచితం. ప్రజాస్వామ్యంలో పాలనా వ్యవస్థకు సంబంధించిన అన్ని విషయాలు ప్రతి పౌరునికి క్షుణ్ణంగా తెలియాలంటే ప్రజల భాషలో అధికారాన్ని కొనసాగించడం చాలా ముఖ్యం. పరిపాలన సమర్థవంతంగా కొనసాగాలంటే ప్రజల తోడ్పాటు కూడా ప్రభుత్వానికి అవసరం.

భారతదేశానికి 1947 సంవత్సరంలో స్వాతంత్ర్యం సిద్ధించడం, 1956లో ఆంధ్రప్రదేశ్ భాషా ప్రయుక్త రాష్ట్రంగా ఏర్పాటు చేయడం, తెలుగు భాషా వికాసానికి చేసిన చారిత్రక సంఘటనలు.

భారత రాజ్యాంగంలోని 345వ అధికరణ తమతమ ప్రాంతీయ భాషలను అధికార భాషలుగా స్వీకరించడానికి రాష్ట్రాలకు అధికార మిచ్చింది. 1906లో సర్‌జార్జి గ్రియర్‌సన్ సంపాదకుడిగా వెలువడిన 'లింగ్విస్టిక్స్ సర్వే ఆఫ్ ఇండియా' అన్న 11వ సంపుటలో 175 భాషలు, 544 మాండలికాల సర్వే కనబడుతుంది. భారతదేశంలో 1652 భాషలున్నట్లు భాషావేత్తల అభిప్రాయం. భారత రాజ్యాంగం 8వ షెడ్యూలులో మొత్తం 18 భాషలకు మాత్రమే అధికార భాషలుగా గుర్తింపు లభించింది. మొదట 14 భాషలకు మాత్రమే అధికార భాషలుగా 1. తమిళం, 2. తెలుగు, 3. కన్నడం, 4. మళయాళం, 5. పంజాబి, 6. బెంగాలి, 7. మరాఠి, 8. హిందీ, 9. ఉర్దూ, 10. ఒరియా, 11. గుజరాతి, 12. కాశ్మీరి, 13. సంస్కృతం, 14, అస్సామ్ 'సింధి' భాష 1967లో 21వ రాజ్యాంగ సవరణ వల్ల 15వ అధికార భాషగానూ 1992లో కొంకణి, మణిపురి, నేపాలి 71వ రాజ్యాంగ సవరణ ద్వారా అధికార భాషలుగా 8వ షెడ్యూల్‌లో చేరడం జరిగింది. ప్రస్తుతం ఈ భాషల సంఖ్య 18. ద్రావిడ భాషల్లో తెలుగు 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్'గా గుర్తింపు పొందింది. అధికార భాషగా కూడా తెలుగుకు ప్రాచీన చరిత్ర ఉంది.

రాజకీయ పరిపాలనలోనూ, అధికారంలోనూ, వ్యవహారంలో ఉన్నటువంటి భాషను పూర్వం 'రాజభాష' అనే వారు. ఇప్పుడు దానిని 'అధికార భాష' అంటున్నారు.

మనదేశంలో భాష ఆధారంగా భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడ్డాయి. ఆయా రాష్ట్రాలలో అత్యధికులు మాట్లాడే భాషను అధికార భాషగా నిర్ణయించడం జరిగింది. ఆ విధంగానే ఆంధ్రరాష్ట్రంలో తెలుగును అధికార భాషగా అమలు పరచాలని నిర్ణయించడం జరిగింది.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత వావిలాల గోపాల కృష్ణయ్యగారు తెలుగును అధికార భాషగా శాసనం చేయడానికి కర్నూలులోను, హైదరాబాద్‌లోనూ, శాసనసభలలో బిల్లు రూపంలోనూ తీర్మాన రూపంలోను 9 సార్లు ప్రతిపాదించారు. 1964లో తెలుగు డిసెంబర్ 7న ఏపీ గెజిట్‌లో ప్రకటించ బడింది. ప్రభుత్వం దీనిని ప్రజాభిప్రాయ సేకరణకు పంపింది. అనంతరం సెలెక్ట్ కమిటీకి పంపింది.

1966 ఏప్రిల్ 1న తెలుగును అధికార భాషగా అంగీకరించడం జరిగింది. ఆంధ్రప్రదేశ్‌లో అధికార భాషగా తెలుగు 1966 మే 14వ తేదీన 'ఏపీ గెజిట్'లో ప్రకటించడంతో శాసనరూపం దాల్చింది. దీన్నే "ఆంధ్రప్రదేశ్ అఫిషియల్ లాంగ్వేజ్ యాక్ట్' అంటారు.

ఈ అధికార భాషా చట్టం నెం. 9. 1996(యాక్ట్ నెం. 9, 1996) ఏపీ రాష్ట్ర అధికార కార్యాలకు, రాష్ట్ర శాసన మండలి వ్యవహార నిర్వాహణకు తెలుగు భాషను ఉపయోగించాలని 1966వ సంవత్సరమే 14వ తేదీన ఆంధ్రప్రదేశ్ అధికార భాషా చట్టం తెలుగు భాషకు రాష్ట్ర అధికార భాషగా శాసన ప్రతిపత్తి కల్పించింది.

ఈ చట్టం ప్రారంభం నుండి 5 సంవత్సరాలు గడిచిన తరువాత రాష్ట్ర ప్రభుత్వం ఉత్తరువు ద్వారా ఒక రాష్ట్ర అధికార భాషా సంఘమును

ఏర్పాటు చేయాలి. ఒక అధ్యక్షుడు, నలుగురు ఇతర సభ్యులు వుండాలి.

రాష్ట్ర శాసనమండలిలో ప్రవేశపెట్టిన బిల్లులన్నింటిలోను, సవరణలోనూ, అది ఆమోదించిన చట్టంలోనూ ఏ తేదీ నుండి తెలుగు భాషను ఉపయోగించవలెనో నిర్దిష్టపరుస్తూ, రాష్ట్ర ప్రభుత్వం 3వ విభాగపు 2వ ఉపవిభాగంలోని (ఎ)లో ప్రకటన జారీ చేసినపుడు అధికార పూర్వక తెలుగు భాషా పాఠంతోపాటు ఆంగ్ల భాషలో దాని అనువాదము కూడా ఉండాలి.

1966 మే 14వ తేదీన శాసన రూపం దాల్చిన ఆంధ్రప్రదేశ్ అధికార భాషా చట్టం ప్రకారం తాలూకా అంతకు తక్కువ స్థాయిలో తెలుగు అధికార భాషగా ప్రవేశ పెట్టబడింది. ఆ శాఖలు : 1. వ్యవసాయ శాఖ, 2. పశుసంవర్ధక శాఖ, 3. రోడ్లు, భవనాల శాఖ, 4. వాణిజ్య పన్నుల శాఖ, 5. సహకార శాఖ, 6. విద్యాశాఖ, 7. అబ్కారి, మధ్యనిషేధ శాఖ, 8. మత్స్యశాఖ, 9. అటవీశాఖ, 10. దేవాదాయ, ధర్మాదాయ శాఖ, 11. భారతీయ వైద్యశాఖ, 12. కార్మిక శాఖ, 13. మున్సిపల్ పరిపాలన శాఖ, 14. పంచాయతీరాజ్ శాఖ, 15. జైళ్ళ శాఖ, 16. పోలీస్ శాఖ, 17. పౌర నిర్మాణాల శాఖ, 18. పౌర గ్రంథాలయ శాఖ, 19. రిజిస్ట్రేషన్, స్టాంపుల శాఖ, 20. రెవిన్యూ శాఖ, 21. ట్రెజరీలు అక్కౌంట్ల శాఖ, 22. గిడ్డంగుల శాఖ, 23. తూనికలు, కొలతలు శాఖ మొదలగునవి.

**1966 మే 14వ తేదీన శాసన రూపం దాల్చిన ఆంధ్రప్రదేశ్ అధికార భాషా చట్టం ప్రకారం తాలూకా అంతకు తక్కువ స్థాయిలో తెలుగు అధికార భాషగా ప్రవేశ పెట్టబడింది.**

అంతేగాక కొన్ని కార్యాలయాల నిమిత్తం జిల్లా స్థాయిలో దిగువ శాఖల్లో అధికార భాషగా తెలుగును ప్రవేశపెడ్తూ ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. 1. పశుసంవర్ధక శాఖ, 2. వ్యవసాయ శాఖ, 3. పంచాయితీ రాజ్ శాఖ (జిల్లా పరిషత్‌లు), 4. దేవాలయ ధర్మాదాయ శాఖ, 5. విద్యాశాఖ, 6. అగ్నిమాపక శాఖ, 7. ఓడరేవుల శాఖ, 8. స్త్రీ సంక్షేమ శాఖ.

మానవ సంస్కృతి మనుగడలో భాష విశిష్టమైనది. దాన్ని మనం ప్రయోజనాలకు వినియోగించుకొంటున్నాం. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్‌లో తెలుగు భాషా ప్రయోజనాల దృష్ట్యా- 1. ప్రాంతీయ భాష 2. మాతృభాష (ప్రథమ భాష) 3. బోధన మాధ్యమం 4. ద్వితీయ భాష 5. అధికార భాషలుగా ప్రభుత్వ కార్యకలాపాల్లో - అధికార నిర్వహణలో వాడుకలో ఉన్నది. అధికార భాష దాన్ని "కార్యాలయ భాష" అని కూడా అంటారు. మనదేశంలో ముస్లింలు పాలించిన ఆయా ప్రాంతాల్లో ఆయా కాలాల్లో ఫార్సీగానీ, ఉర్దూగానీ అధికార భాషగా వాడుకలో ఉండేది. అలాగే బ్రిటీషు వాళ్ళు పాలించిన ప్రాంతాల్లో, ఇంగ్లీషు అధికార భాషగా ఉండేది. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత కూడా ఆంధ్రప్రదేశ్‌లో పరిపాలనా సంబంధమైన వ్యవహారాలు ఆంగ్లంలోనే నడుస్తున్నాయి.

రాష్ట్ర రాజధాని నుంచి జిల్లాలకు, జిల్లాల నుంచి మండలాలకు ఏ సమాచారమయినా ఆంగ్ల భాషలోనే వెలుతుంది. ప్రభుత్వ కార్యాలయంలో ఆంగ్ల భాషనే ఉపయోగిస్తున్నారు.

పరిపాలన, ప్రజల వద్దకు తీసుకురావాలనే ఉద్దేశానికి ఆంగ్ల భాష ఆటంకమవుతుందనే ముఖ్య అంశాన్ని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం గుర్తించింది. అందుకే రాష్ట్రంలో పరిపాలన వ్యవహారాన్నీ తెలుగు భాషలోనే జరగాలని దాన్ని అధికార భాషగా ప్రకటించింది. 'అధికార భాషా సంఘం" అనే పేరుతో 1974లో ఒక సంఘాన్ని కూడా ప్రారంభించింది.

సెలెక్షన్ కమిటీ స్థాయిలో ఆనాటి ముఖ్యమంత్రి పి.వి. నరసింహారావుగారు అనధికార బిల్లుకు బదులు అధికార బిల్లును ప్రతిపాదించడానికి నిశ్చయించారు. తరువాత అది శాసనం అయింది.

ఈ శాసనంలో ప్రతిపాదించిన సూచనలు ఎంతవరకు అమలు పరిచారో వాటి ప్రగతి ఎలా ఉందో పరిశీలన చేయడానికి పి.వి.నరసింహారావు గారి అధ్యక్షతన ఒక పరిశీలనా సంఘాన్ని నియమించారు. ఆ సంఘం 1970లో తన నివేదికను ప్రభుత్వానికి అందచేసింది. "శాసనంలో నిబంధింపబడిన అధికార భాషగా తెలుగు అమలుకు వెంటనే భాషా కమిషన్ ఏర్పాటు చేయాలని సిఫారసు చేసింది. దీని ప్రకారం శాసనం అయిన రోజు నుంచి అయిదు సంవత్సరాలకు ఒక భాషా కమిషన్‌ను నియమించాలని నిర్దేశింపబడింది.

వావిలాల గోపాల కృష్ణయ్యగారి అధ్యక్షతన అధికార భాషా సంఘం ఏర్పడింది. ఆ తరువాత కొంత కాలానికి వందేమాతరం రామచంద్రరావుగారు, తరువాత శ్రీమతి అనసూయాదేవిగారు, అధికార భాషా సంఘం అధ్యక్షులయ్యారు. అనంతరం డా.సి.నారాయణరెడ్డిగారు అధ్యక్షులయ్యారు. వారి పదవీ కాలంలో ప్రత్యేకంగా చెప్పుకోదగ్గ పనులు నిర్వహింపబడినవి. గజ్జెల మల్లారెడ్డిగారు అధికార భాషా సంఘానికి అధ్యక్షులుగా నియమింపబడ్డారు. డా॥ మాడుగుల నాగఫణి శర్మగారు కూడా అధికార భాషా సంఘం అధ్యక్షులుగా తమ కృషిని కొనసాగించారు.

1988లో ప్రభుత్వం కోరిక మేరకు తెలుగు బోధన అకాడమి రాజధానిలోని ఐదు కేంద్రాల్లో ప్రత్యేక తెలుగు బోధన తరగతులు నిర్వహించింది. వివిధ ప్రభుత్వ శాఖల కార్యాలయాల్లో పనిచేసే తెలుగేతర ఉద్యోగులకు స్వల్ప వ్యవధిలో తెలుగు నేర్పడానికి ఏర్పాట్లు చేశారు.దాదాపు 1990 జనవరి వరకు ఈ తరగతులు జరిగాయి. 1000 మంది తెలుగు నేర్చుకున్నారు. నిజానికి తెలుగు అకాడమీ, తెలుగేతరుల ఉపయోగార్థం 1969 నుంచి ఉచితంగా తెలుగు తరగతులు నిర్వహిస్తూనే ఉంది.

అధికార భాషా శాసనం రూపొందినప్పటికీ అంతకుముందే అయ్యదేవర కాళేశ్వరరావు అధ్యక్షతన ఏర్పడిన కమిటీ వారు "పారిభాషిక పదకోశం" 1963లో తయారు చేశారు. తెలుగు అకాడమీ 27,600 పదాలతో "పరిపాలన న్యాయపదకోశం" (1980) వెలువరించింది. ఆంధ్రప్రదేశ్ హైకోర్టు మాన్యువల్‌ను ఇరవై జిల్లా మునసబు కోర్టు తీర్పులను కూడా అకాడమీ అనువదింపచేసింది. ఇన్ని విధాలా చర్యలు చేపట్టినప్పటికీ అధికార భాషగా తెలుగు అన్ని స్థాయిల్లోనూ పటిష్టంగానూ ఎందుకు అమలు జరగడం లేదన్న ప్రశ్న? ప్రశ్నగానే మిగిలిపోయింది.

గ్రామస్థాయిలోనూ, తాలూకా స్థాయిలోనూ తెలుగు అమలు కావడానికి ఆటంకం కలిగే అవకాశాలు ఎక్కువగా లేవు. జిల్లా

స్థాయిలలోను, రాష్ట్ర స్థాయిలోనూ మాత్రమే దీని అమలుకు ఆటంకాలు ఏర్పడుతున్నాయి. తెలుగు అమలు జరగాలని ప్రభుత్వ ఉత్తర్వులు ఉన్నప్పటికీ, అధికార భాషా సంఘం వారు తనిఖీలు చేస్తున్నప్పటికీ, ఆశించిన ఫలితాలు కనిపించక పోవటానికి ప్రధాన కారణాలు :

1. అధికార భాషగా తెలుగును అమలు పరచవలసిన వారికి తగిన భాషా పరిచయం, చిత్తశుద్ధి లేకపోవడం.
2. ఆంగ్ల భాషపై వ్యామోహం ఇంకా తగ్గకపోవడం, ఇంగ్లీషు భాష తమ హెూదాకు చిహ్నమని తలచడం.
3. మన రాజకీయ నాయకుల్లోగాని, పాలకుల్లోగాని, అధికారుల్లోగాని తెలుగు భాష పట్ల శ్రద్ధ లేకపోవడం.
4. భాషా ప్రయుక్త రాష్ట్ర ప్రయోజనాలను విస్మరించడం
5. తెలుగును అమలు పరచకపోతే శిక్షపడుతుందనో, నష్టం కలుగుతుందనో భయం లేకపోవడం.
6. ఆంగ్లంలో రాయడానికి అలవాటు పడ్డ అధికారుల వైఖరి మారకపోవడం
7. తెలుగులో సరఫరా చేయబడిన పారిభాషిక పదకోశాలను వాడటంలో అలసత్వం.
8. కార్యాలయాల్లో తెలుగు టైపిస్టుల - టైప్ మిషన్ల కొరత ఉండటం.
9. తెలుగును అధికార భాషగా అమలు చేయాలనే అభిలాష రాష్ట్రస్థాయి అధికారులకు లేకపోవడం
10. పరిపాలనా వ్యవహారాలకు ఉపయోగించడానికి తగినంతగా తెలుగు ఎదగకపోవడం.
11. ఇంగ్లీషు పదాలు వాడబడుతున్న సందర్భాలకు తగిన తెలుగు సమానార్థకాలు లేకపోవడం వల్ల పదాలను వెతుక్కోవడంలో జాప్యం.
12. తెలుగు సరిగా రాని ఉద్యోగులు తెలుగును ఉపయోగించడంలో ఆసక్తి చూపకపోవడం.

**తెలుగును పటిష్టం చేయాలంటే....**

1. సాంకేతిక భాషగా తెలుగు ప్రయోజనాన్ని గుర్తించి దాన్ని వైద్య, విద్యాబోధనలో, సాంకేతిక, శాస్త్ర విద్యాబోధనలో, పరిశోధనలో వ్యవసాయరంగంలో అమలు పరచడానికి పూనుకోవాలి.
2. న్యాయ, పరిపాలనా భాషను, అనువదించడానికి పూనుకొని సామాన్య ప్రజానీకానికి అర్థమయ్యే రీతిలో దాన్ని పెంపొందించాలి.
3. రాజకీయ నాయకులు, పాలకులు, అధికారులు తెలుగును అన్ని పరిపాలనా సంబంధ వ్యవహారాల్లో వాడేటట్లు చూడాలి.
4. పై అధికారులు తమ కింది సిబ్బందికి తప్పనిసరిగా తెలుగు వాడటంపై తాఖీదులను ఇవ్వడమే కాకుండా స్వయంగా తాము దాన్ని పాటించాలి.
5. సెలవు చీటి దగ్గర నుంచి ఆఫీసు వ్యవహారం వరకు అన్నింటికి కూడా తెలుగును వాడేటట్లు చేయడం.
6. తెలుగు కఠినమనే భావం తొలగించడానికి సమానార్థక పదాలు లేవనే అపోహను పోగొట్టడానికి ప్రతి కార్యాలయంలో ప్రతి ఉద్యోగికి "పారిభాషిక పదకోశాన్ని' అందజేయాలి.
7. పరిపాలనా రంగంలో పటిష్టంగా తెలుగును వాడిన అధికారులకు తెలుగువారు కాని సిబ్బందికి ప్రోత్సాహక బహుమతులను అందచేయాలి.
8. ఎప్పటికప్పుడు అధికార భాషగా తెలుగు అమలుకు సంబంధించిన అధ్యయనం జరగాలి. పర్యవేక్షణలు జరగాలి. మొక్కుబడి విధానానికి స్వస్తి పలకాలి.
9. ఐ.ఎ.ఎస్. ఆఫీసర్లకు కూడా తెలుగులో శిక్షణా తరగతులు నిర్వహించి పరిపాలనా సౌలభ్యం కలిగించాలి.
10. తగిన విధంగా కార్యాలయంలో తెలుగు టైపు మిషన్లు, తెలుగు టైపిస్టులను ఏర్పాటు చేయాలి.
11. రాష్ట్ర విధాన సభల్లో, ఉన్నత స్థాయీ సమావేశాలలో పబ్లిక్ సమావేశాలలో ప్రసంగించే వక్తలందరూ తెలుగులోనే మాట్లాడేటట్లు చేయాలి.
12. తెలుగు వారు కాని ఇతర అధికారులు తప్పకుండా తెలుగు పరీక్షలను పాసు అయ్యేటట్లు చూడాలి. నాణ్యతను పరీక్షించాలి.
13. అన్ని రకాల పబ్లిక్ సర్వీస్ కమిషన్ పరీక్షలను తెలుగులోనే నిర్వహించాలి.
14. పాలనా వ్యవహారంలో ఉపయోగించే తెలుగు పదాలు దొరకనప్పుడు ఇతర భాషల నుంచి తీసుకోబడిన పదాలను యథాతథంగా వాడాలి.
15. ఆయా శాఖలకు సంబంధించిన పదకోశాలను తయారు చేసి అందించాలి.

మనం అన్ని ఉద్యమాలలో, అన్ని త్యాగాలలో మాతృదేశాభిమానంలో ముందుండి నాయకత్వం వహించినట్లే, భాషా ఉద్యమాలు, బోధనలో, పాలనలో కూడా ముందుండి "దేశ భాషలందు తెలుగు లెస్స" అనే దాన్ని సార్థకం చేయాలి. ఆంగ్ల భాష పరిణతి చెందడానికి పూర్వమే మన భాషలోని సాహిత్యం పరిణతి చెందింది. అనేక అవరోధాలను అతిక్రమిస్తూ వికాస మార్గంలో పురోగమిస్తూ నేటి జాతీయ జీవనంలో సముచిత పాత్ర వహించి కొత్త మలుపు తిరుగుతున్నది "అధికార భాషగా తెలుగు"

ఇతర రాష్ట్రాల్లో తొంబై శాతం వారి భాషల్లోనే అధికార వ్యవహారాలు నిర్వహింపబడటానికి వారికి గల భాషాభిమానం, విజ్ఞత కారణాలు. పొరుగు రాష్ట్రాలనాదర్శంగా తీసుకొంటే తప్ప మన ఆలోచన, ఆచరణలలో మార్పు వస్తే తప్ప చట్టాలెన్ని చేసినా ఫలితం శూన్యం.

అధికార భాషగా తెలుగును అమలు పరిచే యజ్ఞంలో భాషావేత్తలు, పండితులు వ్యాకరణ కోవిదులు, అనువాదకులు ఆయా శాఖాధిపతులు, న్యాయవేత్తలు, రేడియో ప్రతి ఒక్కరూ పాలుపంచుకోవాలి. అప్పుడే అన్ని అవరోధాలను అధిగమించి అధికార భాషగా తెలుగు సముచిత పాత్రను నిర్వహిస్తూ అక్షరాలలోనే కాదు ఆచరణలోనూ అగ్రగామిగా మన్ననలందుకో గల్గుతుంది. "అధికార భాషగా తెలుగు."

# చెరగని లక్ష్మణ రేఖ

అంజన




కామన్ మేన్ కన్నుమూశాడు. సైలెంట్ అబ్జర్వర్ మనకు శాశ్వతంగా దూరమయ్యాడు. భారతీయుల జీవితాన్ని కుంచెలో ఇముడ్చుకున్న గొప్ప కార్టూనిస్టు కనుమరుగయ్యాడు. కార్టూనిస్టు ఆర్‌కె లక్ష్మణ్ (జనవరి 26) కన్నుమూశాడన్న వార్త తెలియగానే... మూగబోయిన వారెందరో! అచ్చు ఆయన సృజించిన 'కామన్ మేన్' లాగే. గత ఐదు దశాబ్దాలకు పైగా తన గీతలతో సామాన్యులను సైతం ఆలోచింపజేసిన ఆర్‌కె లక్ష్మణ్ భారతదేశం గర్వించదగ్గ కార్టూనిస్టు, చిత్రకారుడు, రచయిత కూడా.

ఆర్‌కె లక్ష్మణ్‌గా సుపరిచితుడైన ఆయన పూర్తి పేరు రాసిపురం కృష్ణస్వామి అయ్యర్ లక్ష్మణ్. 1921 అక్టోబర్ 21వ తేదీన కర్ణాటకలో విద్యావంతుల కుటుంబంలో జన్మించాడు. తండ్రి హెడ్మాస్టారు కావడంతో ఇంటికి అనేక రకాల పుస్తకాలు వచ్చేవి. చదవడం కూడా నేర్చుకోకముందే ఆ పుస్తకాల్లో కనిపించే బొమ్మల పట్ల ఆకర్షితుడయ్యాడు చిన్నారి లక్ష్మణ్. ఇవికాక ప్రపంచ ప్రసిద్ధ బ్రిటిష్ కార్టూనిస్టు సర్ డేవిడ్ లా (చాన్నాళ్లు నోరు తిరగక 'కా' అని పలికేవాడు) బొమ్మలను చూసి స్ఫూర్తి పొందాడు. ఇక ఇంటి గోడల మీద, బండల మీద... ఎక్కడంటే అక్కడ తను చూసిన ప్రపంచాన్ని బొమ్మలుగా వేసేవాడు. తండ్రి కూడా కుమారుడి బొమ్మలకు ముచ్చటపడిపోయి బాగా ప్రోత్సహించేవాడు. స్కూల్లో చేరాక టీచర్ల బొమ్మలు గీసేవాడు పుస్తకాల మీద. ఓసారి ఏకంగా రావి ఆకు మీద మాస్టారి బొమ్మ వేసి చూపించాడు. గురువుగారు సైతం ఆ చిన్నారి చిత్రకారుడి బొమ్మలు చూసి ముచ్చటపడిపోయి భుజం తట్టి ప్రోత్సహించాడు. ఉన్నత పాఠశాల విద్య పూర్తి చేసుకున్న అనంతరం బొంబాయిలోని జెజె స్కూల్ ఆఫ్ ఆర్ట్స్‌లో చేరి తనకెంతో ప్రీతిపాత్రమైన చిత్రలేఖనంలో డిగ్రీ పొందాలని ఆశించాడు. కానీ లక్ష్మణ్ వేసిన బొమ్మల్లో సత్తా లేదని చెప్పి స్కూల్లో చేర్చుకోడానికి నిరాకరించారు. మైసూర్ యూనివర్సిటీలో బిఏ (బ్యాచిలర్ ఆఫ్ ఆర్ట్స్) చేసి ఫ్రీలాన్సర్‌గా వివిధ పత్రికలకు, మ్యాగజైన్లకు బొమ్మలేయడం మొదలెట్టాడు. మైసూర్ మహారాజా కాలేజీలో చదువుకుంటూనే హిందూ పత్రికకు తన సోదరుడు, ప్రసిద్ధ రచయిత అయిన ఆర్‌కె నారాయణ్ రాసే కథలకు బొమ్మలు వేసేవాడు. 'స్వతంత్ర' పత్రికకు రాజకీయ కార్టూన్లు కూడా వేశాడు. లక్ష్మణ్‌ను కన్నడ 'కొరవంజి' పత్రికాధిపతి బాగా ప్రోత్సహించాడు. మద్రాసులో జెమినీ స్టూడియోస్‌లోనూ పనిచేశాడు. ముంబయిలోని 'ది ఫ్రీ ప్రెస్ జర్నల్' లో తొలిసారిగా పూర్తి స్థాయి రాజకీయ కార్టూనిస్టుగా చేరాడు. అక్కడే శివసేన అధిపతి బాల్‌థాకరే కూడా అప్పట్లో అక్కడ కార్టూనిస్టుగా పనిచేసేవాడు. అనంతరం 'టైమ్స్ ఆఫ్ ఇండియా'లో కార్టూనిస్టుగా చేరి యాభై ఏళ్లకు పైగా 'కామన్ మేన్' పేరిట వ్యంగ్య చిత్రాలను వేశారు. చెత్తకుండీ దగ్గర నుంచి అణు భౌతికశాస్త్రం వరకు... సామాన్యులకు సైతం అర్థమయ్యే పద్ధతుల్లో 'కామన్ మేన్'ను గీసేవాడు. ఓ సామాన్య భారతీయుడి ఆశలు, ఆశయాలు, కోరికలు, కోపాలు, అసహనాలు...అన్నీ ఈ కార్టూన్‌లో కనిపించేవి. అయితే ఇన్నేళ్లలో ధోవతి పంచె కట్టుకుని కళ్లజోడు పెట్టుకున్న ఈ కామన్ మేన్ ఒక్కసారి కూడా మాట్లాడలేదు. అలా తన చుట్టూ జరుగుతున్న ప్రతి దాన్నీ పరిశీలించేవాడంతే... ఆ పరిశీలనలోంచే ప్రజలను చైతన్యవంతులను చేసేవాడు లక్ష్మణ్. అయితే దేశంలోని అన్ని రాష్ట్రాలను, సంస్కృతులను తన కార్టూన్‌లో ప్రతిబింబించేవాడు. కాకపోతే పత్రిక డెడ్‌లైన్ దృష్ట్యా నేపథ్య గీతలకు పెద్దగా ప్రాధాన్యత ఇచ్చేవాడు కాదు. కేవలం కామన్ మేన్, అతని పరిశీలన మీదే శ్రద్ధ పెట్టేవాడు. ఇంతగా గుర్తింపు పొందిన 'కామన్ మేన్'కు పూనాలోని విశ్వభవన్ ఎనిమిదడుగుల విగ్రహాన్ని ఏర్పాటు చేసి సత్కరించుకుంది.

లక్ష్మణ్ పలు హిందీ, తమిళ చలన చిత్రాలకు సైతం కార్టూన్లు వేసిచ్చారు. ఆర్‌కె నారాయణ్ రాసిన 'మాల్గుడి డేస్' నవల ఆధారంగా రూపొందించిన టీవీ సీరియల్‌కు కూడా కార్టూన్లు అందించాడు. లక్ష్మణ్ మంచి రచయిత కూడా. 'ది రీల్ వరల్డ్, కామన్ మేన్, డోస్ ఆఫ్ లాఫ్టర్, డిస్టార్టెడ్ మిర్రర్, ది టనెల్ ఆఫ్ టైమ్..' వంటి పలు పుస్తకాలు కూడా అందించాడు. రామన్ మెగసెసే అవార్డు, పద్మ భూషణ్, పద్మ విభూషణ్ వంటి అనేకాక అవార్డులు, ఎన్నో రివార్డులు అందుకున్న లక్ష్మణ్ విలేకరుల ప్రశ్నలకు కొంటె సమాధానాలివ్వడంలో దిట్ట. కార్టూనిస్టులందరిలోకి ప్రత్యేకంగా ఎలా నిలబడగలిగారంటే... నా తెలివితేటల వల్లే అని నవ్వేసే లక్ష్మణ్ ఇప్పుడే కాదు... ఎప్పటికీ కార్టూనిస్టులకు, చిత్రకారులకు స్ఫూర్తినిస్తూనే ఉంటారు 'కామన్ మేన్' రూపంలో.

(ప్రజాశక్తి దినపత్రిక **27.01.2015** సౌజన్యంతో..)

# నిప్పుల కొరడా!

- వంగర పరమేశ్వరరావు
8143237847



వదరబోతు వంచన
ఖాండ్రించి ఉమ్మేస్తే
పుట్టు కొచ్చిన... 'ఈ' నగరం!
మృగ్య మానవత్వ
ముళ్ళ రాదారులను పరుచుకుంటూ -
'ప్రశాంత' శాంత కపోతాల్ని కబళించేస్తూ...
నరనరాన నాజూకుతనం తీవెలైసాగుతూ...
పెట్టుబడి - రాబడి కాసుల గలగల త్రాసులో...
వయ్యారపు వొయలుపోతూ
లెక్కల కుస్తీల గారడీలతో
జనమంతా బహు ఉషారు!
జగమంతా పారా హుషార్!!

అక్షయ పాత్రలో అన్నం మెతుకై
కడసార విందులు వడ్డించే
కబ్జాల మృష్టాన్నాలు ఎన్నో!
బతుకు తెరువు రేవులో
అనుబంధాల మృణ్మయ- 'ఓటి పడవలు'
నెత్తుటి ప్రవాహ ఒరవడిలో
దారులు వెతుక్కుంటున్నాయ్!!

భవిష్యత్తు పై బెంగ పెట్టుకున్న
సైంటిస్టుల ట్వీస్టులు
అంగారకుడ్ని తవ్వి పోయడానికి
గిరికీలు కొట్టే 'మామ్!'
గుప్పెడు మెతుకుల
ఆకలి ఆనవాళ్ళ 'ఛాయా చిత్రాల'ను
అస్సలందించదు!

ఖండాంతర ఖ్యాతిని
కొలిచే కలాల ప్రయోగాలు
మార్చురీలకు తరలివస్తోన్న
అనాథ శవాల అడ్రసులను
అందివ్వ లేవు!
కంటి తుడుపు పథకాల 'పల్లకీ'లో
రారాజై ఊరేగే 'సగటు మనిషి'
బికారీ, రాజ్యాధిపతై
నిత్యం - 'జీవచ్ఛవం'లా
పట్టాభిషిక్తుడవుతూనే ఉన్నాడు!
మండే గుండెలు

అగ్ని గోళ మీటింగు 'మిస్సైల్'ను
సంధించగానే..
చెరసాలలు కళ్ళు తెరుచుకుని
సంకెళ్ళ చేతులు చాస్తూ
పరిష్వంగ రంగాలు
నోరు నొక్కే సాకుల్ని
సిద్ధం చేస్తున్నాయ్!

శంఖు స్థాపనా శిలాఫలక
తోరణాలతో
బుల్డోజర్ల వీరంగాలతో - పచ్చనాకు
సాక్షిగా
రమణీయ ప్రకృతిని హరిస్తోన్న -
'అభివృద్ధి' మంత్రం
రాచపుండై సలుపుతూ
జ(న)వ జీవాలు తోడేస్తుంది!

ఎన్నిసార్లు ... ఎన్ని 'కల'లు
పాచిక లాటలో
ప్రాణాలొడ్డే 'ఓటమి' పోరులో
దేగల విలాస లాస్యాల
మీసాలు దువ్వుడు
దండకాలు!
తర తరాలు కూర్చొనే కుర్చీ
సణుగుతూనే ఉంటుంది!
యుగయుగాలు నేర్చుకునే
పాఠాల గుణపాఠాలు
పాకులాటలు!
కిరణాల దివిటీల కళ్ళ'ను
వెలిగిస్తూ
ఎర్రబడ్డ సూరీడు
రుధిర రాజ్యాంగ శ్రమ
పీఠికలను
తూర్పున లిఖిస్తూ
ఉగ్రతాండవం చేస్తున్నాడు.



# భావ ప్రకటనపై ఉన్మాద కరవాలం



డిసెంబర్ నెలలో ఆందోళనలు ప్రారంభించారు. ఆర్ఎస్ఎస్, హిందూ మున్నాని అనే సంఘాలు సంయుక్తంగా ఈ ఆందోళనలు చేశాయి. ఆ నవలలోని కొన్ని భాగాలను అందరికీ పంచారు. సరిపోక పోతే ముద్రించి మరీ ప్రజలలో ప్రచారం చేశారు. తిరుచెనగొడి పట్టణంలో ఎక్కడ చూసినా విద్వేషాన్ని రెచ్చగొట్టే నినాదాలతో పోస్టర్లు అంటించారు. తిరుచెనగొడి పట్టణం పరువు తీశాదని, కొంగునాడు ప్రాంతంలోని మహిళలను అవమానపరుస్తూ రాశాదని రచయిత పట్ల విద్వేషం కలిగించారు.

- వారప్రసాద్

హిందూ మతోన్మాద, కులోన్మాద శక్తులు ఆందోళనలు రేపి, బెదిరించి తమిళ రచయిత పెరుమాళ్ మురుగన్‌ను తన సొంత పూరు నుండి వెళ్ళగొట్టారు. తీవ్ర మనోవేదనకు గురైన రచయిత 'నేను రచయితగా మరణించాను. కేవలం ఉపాధ్యాయుడిగా మాత్రమే ఇకముందు జీవిస్తాను' అని ప్రకటించి తనకు ప్రియమైన సాహిత్యలోకం నుండి నిష్క్రమించాడు. పత్రికలలో, టీవిలలో, ఇంటర్నెట్ మాధ్యమంలో పెద్దయెత్తున చర్చకు నోచుకున్న ఈ సంఘటన సంచలనం కలిగించింది. ప్రజాస్వామిక, లౌకిక, అభ్యుదయ, ప్రగతిశీల ఆలోచనా పరులకు తీవ్ర ఆందోళన కలిగించింది. పెరుమాళ్ మురుగన్‌కు మీడియాతో సహా, రచయితలు, ప్రజాస్వామిక వాదులు, సాహిత్యాభిమానుల దేశవ్యాప్తంగా మద్దత్తుగా నిలిచారు. కాని తన ప్రాంతంలోనే తాను జీవించలేని భయానక వాతావరణాన్ని మురుగన్ ఎదుర్కొంటున్నారు. ఇన్నాళ్ళూ తన జీవితాన్ని పెనవేసుకున్న తిరుచెనగొడె పట్టణంలోని ప్రజలలో రచయిత పట్ల విద్వేషాలు రగిల్చారు.

ఈ సంఘటనలకి కారణమైన 'మధోరుభగన్' నవలను పెరుమాళ్ మురుగన్ 2010లో రాశారు. సాహిత్య విమర్శకులు మంచి నవలగా పేర్కొన్నారు. పలు ముద్రణలు పొందింది. 2013 డిసెంబర్‌లో ఈ పుస్తకాన్ని ప్రసిద్ధ ప్రచురణ సంస్థ 'పెంగ్విన్' ఇంగ్లీషులో 'ఒన్ పార్ట్ వుమెన్' పేరుతో ప్రచురించింది. అంతా ప్రశాంతంగానే జరిగింది. ఈ లోపున ఎన్నికలు జరిగాయి. ఆర్ఎస్ఎస్ నాయకుడిగా ఎదిగిన నరేంద్రమోడీ భారత ప్రధాని అయ్యారు. హిందూ పురాణాల్లో ఈనాటి సైన్స్‌ను తలదన్నే సైన్స్ ఉందని అధికారిక కార్యక్రమాల్లో ప్రసంగాలు చేశారు. భగవద్గీతను జాతీయ గ్రంథంగా ప్రకటించాలని విదేశీ వ్యవహారాల శాఖా మంత్రి సుష్మాస్వరాజ్ మీడియాకు గంభీర ప్రకటనలిచ్చారు. భిన్న సంస్కృతుల దేశంలో మెజారిటీ మత సంస్కృతిని రుద్దడానికి ఈ పద్ధతిలో పెద్దయెత్తున ప్రయత్నాలు జరిగాయి. సంఘపరివార్ శక్తులు తమ ప్రచారాన్ని ఉధృతం చేసి హిందూ మతోన్మాదాన్ని రెచ్చగొడుతున్న సంఘటనలు ఈ రూపంలో కనపడుతున్నాయి. మతాభిమానాన్ని వాడుకుని ప్రజలలో విద్వేషాలు రెచ్చగొట్టే చర్యలే ఇవన్నీ. 'మధోర్‌భగన్' నవలలోని కొన్ని భాగాల్ని వ్యతిరేకిస్తూ సాగిన ప్రచారాన్ని ఈ నేపథ్యంలోంచి చూసినప్పుడు అసలు విషయం అర్థమవుతుంది.

డిసెంబర్ నెలలో ఆందోళనలు ప్రారంభించారు. ఆర్ఎస్ఎస్, హిందూ మున్నాని అనే సంఘాలు సంయుక్తంగా ఈ ఆందోళనలు చేశాయి. ఆ నవలలోని కొన్ని భాగాలను అందరికీ పంచారు. సరిపోక పోతే ముద్రించి మరీ ప్రజలలో ప్రచారం చేశారు. తిరుచెనగొడి పట్టణంలో ఎక్కడ చూసినా విద్వేషాన్ని రెచ్చగొట్టే నినాదాలతో పోస్టర్లు అంటించారు. తిరుచెనగొడి పట్టణం పరువు తీశాదని, కొంగునాడు ప్రాంతంలోని మహిళలను అవమానపరుస్తూ రాశాదని రచయిత పట్ల విద్వేషం కలిగించారు. ఆ నవలను నిషేధించి, రచయితను అరెస్ట్ చేయాలంటూ బంద్ ప్రకటించారు. రచయితకు, కుటుంబ సభ్యులకు బెదిరింపు ఫోన్‌కాల్స్ వచ్చాయి. నవల ప్రతులను తగలబెట్టారు. తిరుచెనగొడిలోని నవలలో పేర్కొన్న కైలాసనాథ

దేవాలయం దగ్గర నుండి పోలీస్ స్టేషన్ వరకూ ఈ మతోన్మాద శక్తులు ర్యాలీ నిర్వహించి ఉద్రిక్త పరిస్థితులను కల్పించారు. ఈ ఆందోళనాకర పరిస్థితిని చూసి పెరుమాళ్ మురుగన్ వాళ్ళు వ్యతిరేకిస్తున్న భాగాలను తొలగిస్తానని ప్రకటించాడు. తరువాత ప్రచురించబోయే సంచికలలో ఆ భాగాలు తీసేసి ముద్రిస్తానని, నవలలోని తిరుచెనగొడి పేరును మారుస్తానని కూడా ప్రకటించారు. కాని ఫలితం లేకపోయింది. ఈ నేపథ్యంలో పోలీసులు పెరుమాళ్ మురుగన్ మీద వత్తిడి తీసుకొచ్చి కుటుంబాన్ని తిరుచెనగొడి నుండి తరలి వెళ్ళేలా చేశారు.

తిరుచెన్‌గొడి పట్టణంలోని 'కైలాసనాథ దేవాలయం'లో జరిగే ఒక ఉత్సవం గురించిన ప్రస్తావన 'మధోరుభగన్' నవలలో ఉంటుంది. సంతానం కలగని దంపతులు ఆ ఉత్సవంలో పాల్గొని అపరిచితులతో లైంగికంగా కలిసి సంతానం పొందవచ్చు. ఈ పద్ధతికి ఆనాడు ఆమోదం ఉండేదని రచయిత రాశారు. అలా పుట్టిన సంతానానికి 'దేవుని బిడ్డలు' పేరుతో కుటుంబం, సమాజం కూడా ఆమోదం తెలిపేదని కథనం చేశాడు రచయిత. సుమారు వంద సంవత్సరాల క్రితం ఇటువంటి పద్ధతి అమలులో ఉందని రచయిత అభిప్రాయం. ఈ అభిప్రాయాలు కొంగునాడు ప్రాంతంలోని మహిళను అవమానపరచేవిగా ఉన్నాయనే సాకుతో సంఘపరివార్ శక్తులు విద్వేష ప్రచారం చేశాయి. ఈ సంఘటన అందరి దృష్టికీ వెళ్ళగానే ఈ ఆందోళనలకు నాయకత్వం వహించిన సంఘ్‌పరివార్ శక్తులు మెల్లగా పక్కకు తప్పుకుని భావ ప్రకటనా స్వేచ్ఛకి మేం వ్యతిరేకం కాదు అని సన్నాయి నొక్కులు నొక్కుతున్నాయి. కాని తెరవెనుక అంతా కథ వాళ్ళు నడిపిస్తున్నదే.

**పెరుమాళ్ మురుగన్ తీవ్ర మనస్థాపంతో చేసిన ప్రకటన సాహిత్య, సామాజిక లౌకిక, ప్రజాస్వామిక వాదులను కదిలించింది. పెరుమాళ్ మురుగన్‌కు రచయితలు, పాత్రికేయులు బాసటగా నిలిచారు. సాహిత్య సంస్థలు పెద్దయెత్తున సంఘీభావం తెలిపాయి. సోషల్ మీడియా వెన్నంటి నిలిచింది. దేశవ్యాప్తంగా హిందూ ఫాసిస్టు చర్యలకు తీవ్ర నిరసన వ్యక్తం అయ్యింది. పెరుమాళ్ మురుగన్‌ను తన నిర్ణయాన్ని వెనక్కి తీసుకోవలసిందిగా పలు సంస్థలు, పలువురు ప్రముఖులు కోరారు.**

పెరుమాళ్ మురుగన్ తీవ్ర మనస్థాపంతో చేసిన ప్రకటన సాహిత్య, సామాజిక లౌకిక, ప్రజాస్వామిక వాదులను కదిలించింది. పెరుమాళ్ మురుగన్‌కు రచయితలు, పాత్రికేయులు బాసటగా నిలిచారు. సాహిత్య సంస్థలు పెద్దయెత్తున సంఘీభావం తెలిపాయి. సోషల్ మీడియా వెన్నంటి నిలిచింది. దేశవ్యాప్తంగా హిందూ ఫాసిస్టు చర్యలకు తీవ్ర నిరసన వ్యక్తం అయ్యింది. పెరుమాళ్ మురుగన్‌ను తన నిర్ణయాన్ని వెనక్కి తీసుకోవలసిందిగా పలు సంస్థలు, పలువురు ప్రముఖులు కోరారు. తమిళనాడు ప్రగతిశీల రచయితల సంఘం అధ్యక్షులు తమిళ సెల్వం, కార్యదర్శి వెంకటేశన్, ఆధ్వర్యంలో రచయితకు మద్దత్తుగా, నవల ప్రతులతో చెన్నయ్‌లో ప్రదర్శన నిర్వహించారు. హిందూ పత్రిక ఆధ్వర్యంలో నిర్వహిస్తున్న 'హిందూ లిటరరీ ఫెస్ట్' వేదికగా రచయితల, సాహితీ అభిమానులు, పాత్రికేయుల సమావేశం నిర్వహించి ఫాసిస్టు శక్తుల చర్యలను తీవ్రంగా ఖండించారు. తిరుచెన్‌గొడి పట్టణ పోలీసుల, అధికారుల తీరును తప్పుబట్టారు. రాజ్యాంగం ప్రకటించిన 'భావ ప్రకటనా' స్వేచ్ఛకు వ్యతిరేకంగా వ్యవహరించారని పేర్కొన్నారు. ఫాసిస్టు మూకలను అణచివేయడంలో, రచయితకు తగిన రక్షణ కల్పించడంలో తీవ్ర వైఫల్యం ఉందని రచయితలు తమ నిరసన వ్యక్తం చేశారు.

పెరుమాళ్ మురుగన్ కొంగునాడు ప్రాంతానికి చెందిన పేద రైతు కుటుంబంలో పుట్టారు. తమిళనాడు రాష్ట్రంలోని పశ్చిమప్రాంతం 'కొంగునాడు'గా ప్రసిద్ధం. కోయంబత్తూరు, నమక్కాల్, ఎరోడ్, ధర్మపురి, తిరుప్పూర్, సాలెం, కరూర్, నీలగిరి, కృష్ణగిరి, ఎరోడ్ వంటి సుమారు పదిజిల్లాల పరిధిలో విస్తరించి ఉంటుంది. ప్రసిద్ధ హేతువాద ఉద్యమ నాయకుడు పెరియార్ రామస్వామిది కూడా ఈ కొంగునాడు ప్రాంతమే. ద్రవిడ పార్టీల మూలం ద్రవిడ కజకం పార్టీ స్థాపకుడుగా పెరియార్ ప్రాచుర్యం తెలిసిందే. ఇటువంటి నేపథ్యం ఉన్న చోట మతోన్మాద, కులోన్మాద శక్తులు పెచ్చువీరిపోవడం ఆందోళనకరం. నమక్కాల్ జిల్లాలోని తిరుచెనగుడి పట్టణానికి దగ్గర ఉన్న ఒక గ్రామం పెరుమాళ్ మురుగన్ తండ్రిది. మెట్ట ప్రాంత వ్యవసాయం గిట్టుబాటు కాకపోవడంతో తిరుచెనగుడి పట్టణంలో సోడా బండి పెట్టుకుని కుటుంబాన్ని పోషించాడు. సామాజికంగా పెరుమాళ్ మురుగన్ కుటుంబం బిసిలలో గౌండర్ కులానికి చెందింది. కొంగునాడు ప్రాంతంలో ఈ కులానిదే ఆధిపత్యం. రాజకీయ సమీకరణాలలో ఈ కులం కీలకంగా ఉంటుంది. అందుకే రాజకీయ పార్టీలు డిఎంకె. ఎఐడిఎంకెలు కూడా ఆచితూచి ఈ సంఘటనపై స్పందిస్తున్నాయి. డిఎంకె నాయకుడు కరుణానిధి కూతురు కళిమొని, రాజాలపై కేసులుండటం, జయలలితపై కూడా ఆస్తుల కేసులుండటం వీళ్ళు స్పందించకపోవడానికి కారణాలుగా కనిపిస్తున్నాయి. ప్రభుత్వాధికారంలో మతోన్మాదానికి ఊతమిచ్చే శక్తులు ఉండటం ఎంత ప్రమాదకరమో ఈ పరిణామాలు చాటిచెప్తున్నాయి.

# కూలోళ్ళు

డా॥ పొదిలి నాగరాజు
9052038569



కనుపాప రూపమే
అనంత వెలుగుకి ఆధారం
అది లేదంటే అంతా అంధకారం
సర్వం శూన్యం
**కనుపాపలు.... పేదలు**

బిందువుల సంకల్పమే
సింధువాళికి చలనం, సంచలనం
కాదంటే దారంతా ఎడారే
బతుకంతా కరువూ, కాటకమే
**బిందువులు... సేవకులు**

ధాన్యపు గింజ శక్తే
పెను ఆకలికి విముక్తి
ఈ కలికి ముక్తి
పండకుంటే జీవరాశి నాస్తి,
అంతటితోనే స్వస్తి
**గింజలు... రైతులు**

మేఘంలేని గగనం
పేరుకే ఆకాశం
అక్కడంతా జీవచ్ఛవం
విత్తనంలేని పంటపొలం
**మేఘాలు... కార్మికులు**

వేరు ఊపిరే
చెట్టుకు జీవనాడి
ఆ నాడే ఎండితే
అక్కడ ప్రాణం
ఇక్కడ శ్వాసా అంతే, గల్లంతే
**కూకటివేళ్ళు... దళితులు**

రూపాయి పుట్టుకే
కోట్లకు విలువ
కూడదంటే కుభేరుడూ కింకరుడే
**రూపాయలు ... వెట్టివాళ్ళు**

పేదలు, సేవకులు
రైతులు, కార్మికులు
దళితులు, వెట్టివాళ్ళు
**వెరసి ... కూలోళ్ళు**

వీళ్ళంతా...
సమాజాన్ని నడిపించే గొప్పోళ్ళు
శ్రమను త్యాగం చేసే మంచోళ్ళు
వీళ్ళున్నంత కాలమూ
సుఖజీవనం,
వసంతకాలం,
సస్యశ్యామలం,
వీళ్ళులేని నాడు
అంతా వల్లకాడు
ఆ సమాజం
వెన్నుముకలేని అస్థికం
చిగురు చూడని మోడుజీవితం

---

తిరుచన్‌గొడె పట్టణంలో ప్రభుత్వ కళాశాలలో అధ్యాపకుడిగా ఉంటూ పెరుమాళ్ మురుగన్ చేసిన సాహిత్య కృషి విలువైనది. కొంగునాడు ప్రాంతంలోని ప్రజలు మాట్లాడుకునే తమిళభాషలోని వివిధ యాసలతో కూడిన మాండలిక పదాలను సేకరించి సంకలనం చేశారు మురుగన్. ఆ ప్రాంతంలోని సామాజిక, సాహిత్య, సాంస్కృతిక అంశాల పట్ల గాఢమైన ఆసక్తి వల్ల తన రచనల నిండా అక్కడి సంస్కృతే ప్రతిబింబిస్తుంది. ఆరు నవలలు, నాలుగు కథా సంపుటాలు, నాలుగు కవితా సంపుటాలు వెలువరించారు. వలు సంకలనాలకు సంపాదకులుగా వ్యవహరించారు. చెన్నైలోని మద్రాసు విశ్వవిద్యాలయం నుండి పిహెచ్‌డి పట్టా పొందిన పెరుమాళ్ మురుగన్ వామపక్ష మద్రాసులోని మార్క్సిస్టు, లెనినిస్టు గ్రూపుల పరిచయంతో మార్క్సిజానికి ఆకర్షితులయ్యారు. ఆ దృక్పథంతోనే తన ప్రాంత ప్రజల జీవనాంశాలను ఇతివృత్తాలుగా చేసుకుని రచనా వ్యాసంగం కొనసాగిస్తూ వచ్చారు.

ప్రతిభావంతుడైన ఒక రచయిత గొంతునొక్కడానికి ప్రయత్నిస్తున్న ఫాసిస్టు శక్తుల దుర్మార్గాల్ని ఎదుర్కోవాల్సిన అవసరం సామాజిక బాధ్యత గల ప్రతీ ఒక్కరికీ ఉంది. పెరుమాళ్ మురుగన్‌కు తెలుగు సాహిత్యలోకం కూడా వెన్నుదన్నుగా నిలవాల్సిన అవసరం ఉంది. ఇటువంటి సంఘటనలు దేశంలో ఎక్కడైనా చోటుచేసుకోవడానికి తగిన వాతావరణం ఇప్పటికే ఏర్పడి ఉంది. ప్రగతిశీల, లౌకిక, ప్రజాస్వామిక శక్తులు సమైక్యంగా ప్రతిఘటిస్తే తప్ప ఇటువంటి సంఘటనలు జరగకుండా ఆపలేం. పెరుమాళ్ మురుగన్ ఫాసిస్టు శక్తుల బెదిరింపులను, దౌర్జన్యాన్ని ఎదుర్కోవడంలో అందరం తోడుగా ఉందాం. 

కథ

# దింపుడు కళ్లెం



- జి. నరసింహమూర్తి
8977987266

**సుబ్బారావు మృత దేహాన్ని నాలుగురోడ్ల సెంటర్లో గాంధీ బొమ్మ దగ్గర ఘనంగా దింపారు. ఎలా సంపాయించుకొచ్చారో, నాలుగు తారాజువ్వలు గాల్లోకి వదిలి అందర్నీ అదరగొట్టడంతో, అవి శవయాత్ర తారాజువ్వలని అర్థమయ్యింది. గాంధీగారి బొమ్మ అక్కడందర్నీ చూస్తూనే ఉంటుంది గాని ఆ ఊపిరాడని సెంటర్లో ఎవడి స్వార్థం వాడిది, ఎవడి లాభం వాడిది.**

అనేక శవాలు గతంలో ఎన్ని వెళ్ళలేదు ఆ సెంటర్లోంచి. అయ్యో పాపం అన్నవాడెవడు? - గబగబా అమ్మకాలు సాగాలి, లాభాలు రావాలి. రేపు కూడా మనం ఇదే సెంటర్నుంచి వెళ్తాం అన్న ఆలోచన ఒక్కడికీ లేదు.

దింపుడు కళ్లెం శవయాత్రలో ఓ ప్రధానాంశం. తిరిగి ప్రాణం తిరిగిరావచ్చునేమోనని. చచ్చిపోయినవాళ్ళు తిరిగి కొన్ని కారణాల వల్ల పాడె మీంచి లేచి కూర్చున్న ఘటనలైతే యెవ్వరూ చూల్లేదుగాని విన్నవాళ్ళు ఉండొచ్చు. అదేవిధంగా సుబ్బారావు శవం తిరిగి లేచి కూర్చుంటుందేమోనని అందులో చాలామందికి ఆశ.

ఆ శవ యాత్రలో వీ.హెచ్.డీలూ, సుబ్బారావు బంధువర్గానికి చెందిన సైన్సు పాఠాల్లో కాకలు తీరిన కాలేజీ లెక్చరర్లు, పెద్ద పెద్ద చదువులు చదివి పారేసిన వాళ్లూ, అంతెందుకు అమెరికాలో జెనిటిక్ ఇంజనీర్గా పనిచేస్తున్న ఓ మేథావీ ఇంకా ఇంకా అనేక రంగాల్లో బాగా తెలివైన వాళ్లుగా పేరున్న వాళ్లు ఆ శవయాత్రలో ఉన్నారు.

శవం మురుక్కాలవ గట్టుకుచేరాలి ఎందుకంటే సర్వేరికార్డుల్లో శ్మశానానికి కేటాయించిన అరెకరం ఓ పెద్ద రైతు చాలా తెలివిగా ఆక్రమించుకుని అనుభవిస్తున్నాడు. అటు పూడ్చటానికైనా, తగలబెట్టడానికైనా చాలామటుకు పక్క రైతుల ఆక్రమణలకు గురైన ఆమురుక్కాలవగట్టే. అక్కడకొచ్చే శవాలు ఎందుకు చచ్చాన్రా బాబూ అంటూ ఏడుస్తూ కూర్చుంటాయి అక్కడకొచ్చి. కారణం చాలీచాలని ఆ కూంతలోనే పడిచావాలి కనుక.

సుబ్బారావు శవాన్ని తగులబెట్టేందుకే నిర్ణయమైపోయింది గనుక, అటువంటి కార్యక్రమాల్ని చక్కబెట్టుకునే ఓ జట్టు కర్రా బుర్రాతో, సూరిబాబు వైన్‌షాపులో సారా బాటిల్స్‌తో ముందే దారితీసింది తక్కిన యేర్పాట్లు చూసుకునేందుకు.

శవయాత్ర పిటపిటలాడే మిట్ట మధ్యాహ్నం చిన్నపాటి రథయాత్రలా సాగుతోంది. దింపిన పాడెచుట్టూ ఉన్నవాళ్లకి ఒకటే చెమట్లు. శవాన్ని వదిలి నీడచాటుకు పోదామని వాళ్ళకనిపిస్తున్నా, అది సమయం కాదు.

గాంధీబొమ్మ దిమ్మకింద దన్నుగా రెండు కర్రలు పాతుకుని యెప్పట్నుంచో చెప్పులు కుట్టుకునే దుంపడు అంటే ఆ చుట్టుపట్ల అందరికీ తెలుసు. దుంపడు తన చిన్నతనంలో ఊళ్లు, రాష్ట్రాలూ తిరిగాడు. కలకత్తా, బొంబాయి చూశాడు. బాగా తిరిగినాడు కనుక లోకజ్ఞానం ఉంది. నాలుగు చోట్లూ చూశాడు గనుక తెలివితేటలూ అబ్బాయి.



పొట్టిగా, గుండ్రంగా, బలంగా ఉండేవాడు గనుక ఎవరుపెట్టిన పేరో 'దుంపడు'గా పేరెల్లి పోయాడు. అతనికసలు పెళ్లాం బిడ్డలూ ఉన్నారో లేదో, అసలు అతని పూర్వీకులెవరో యెవరికీ తెలీదు. వయస్సు మళ్లిపోయింది 'గనుక అక్కడే చెప్పులు కుట్టుకోవడం, ఆ పక్కనే పడక.

దుంపడు పూర్వీకులు ఆంగ్లేయులు ఇండియా పాలించే సమయంలో వాళ్లదగ్గర పనిచేసినట్టూ, వాళ్లలా క్రమశిక్షణా, మాట మీద నిలబడటం తనకు అబ్బిందనీ అప్పుడప్పుడూ కొందర్తో చెబుతూ ఉంటాడు. అంతా దుంపడు అంటారుగాని పూర్తిపేరు యార్లగడ్డ వెంకన్నగా ఎలక్షన్ లిస్టులో కనిపిస్తుంది.

దింపుడు కళ్లెం శవం గాలిపీల్చి చాలా రోజులయ్యింది. సుబ్బారావు ఆఖరిరోజుల్లో చాలా పస్తులు పడ్డాడు. అలాగని అతని రక్తమాంసాల్ని తీసేందుకు దండయాత్రకి తయారైన సూక్ష్మజీవులకు జాలి ఉండదు. ఆ శవానికి కావలసిన మనుషులే దానికి దూరంగా జరిగి నుంచుంటున్నారు. వాసన ప్రారంభం కావడంతో.

దుంపడు మాత్రం ఆ వాసన్ని భరిస్తున్నాడు. శవం పాడైపోయిం తర్వాత వాసన కొట్టక, మంచి గంధపు సువాసనలొస్తాయా? అతనటువంటి వెన్నో అనుభవించిన అనుభవసీయుడు తన జీవితంలో.

దుంపడి దగ్గరకి తెగిన చెప్పు గూడ కుట్టించుకోడానికొచ్చాడు పక్క ఊరు సత్యానందం. గూడతెగిన చెప్పు దుంపడి ముందుపెడుతూ వాసనకి ముక్కు చీదరించుకున్నాడు.

సత్యానందం ముక్కు మూసుకుంటూ "వోరి దుంపా! గొడ్డు మాంసం కుళ్ళబెట్టుకు తింటున్నావేంటి? కలరా వొచ్చి చస్తావ్‌రా నా కొడకా" అన్నాడు పాతపరిచయం మీదున్నా చనువు చొప్పున.
"కూడు లేకుంటే పత్తున్నానేగాని పాడయిపోయిన తిండి తిన్లేదు నేనెప్పుడూ" అన్నాడు దుంపెడు.

"మరేంటి ఆ కంపు, ఘుప్పుమంటూంటే?" దుంపడు తల తిప్పి దింపెడు కళ్లెం వేపు చూపించాడు.

"పేగులు దేవేస్తుంది - ఎవర్ది?" అడిగాడు సత్యానందం

"మోరిపోడు - కటికిరెడ్డి సుబ్బారావు - ఆశకుపోయి యెడాపెడా ముప్పర్తోళ్ల దగ్గరా, జానా వోళ్ళదగ్గరా అప్పులు చేశాడు. కోట్లు కూడబెట్టాలని - కడకి దిబ్బైపోయాడు. ఇంకోమార్గం లేక తెలివిగా తెల్లారగట్లే రేవు దాటెల్లి రైలు పట్టాల మీద కాళ్లు చాచుకుతొంగుని కళ్లు మూసుకున్నాడు" వివరించాడు దుంపడు.

దిమ్మ మీదున్నా గాంధీబొమ్మ వీళ్ల సంభాషణ వింటూనే ఉంది.

"శవం ఇంత దెబ్బతిందేటి?"

"రైలుకింద పడి వారం కావొస్తుంది... ఆ పంచనామాలు, డాక్టర్ల రిపోర్టులూ, పోలీసుల తతంగం, శవాలమీద ఏరుకునే మామూళ్లూ గట్రా దాటుకొచ్చేసరికి శవం పేసుం పేసుం అయిపోయింది" చెప్పాడు దుంపడు తనకు తెలిసిన విషయాలు

"ఓరి వీళ్ల యిల్లు బంగారం గానూ. గబగబా పోయి దాని పని చూడక యిక్కడ పెట్టుకూర్చున్నారే ఈ జనం?"

"ఆ దింపుడు కళ్లెం పెట్టిన చదువుకున్నా వాళ్లనడుగు"

"ఆ పోయినోడి కేమో గాని, ఈ శవం కూడా వెళ్తున్న తెలివైన బుర్రలకి పెట్టాలి దింపుడు కళ్లెం" అంటూ సత్యానందం కాండ్రించి ఊసాడు.

'చాలాకాలం తర్వాత సత్యాన్ని విన్నందుకు ఆనందంగా ఉంది బాబూ' అంటూ అభినందిస్తోన్నట్టుంది గాంధీవిగ్రహం.



## యుద్ధం ముగిసాక

- అడిగోపుల వెంకటరత్నమ్
9848252946



యుద్ధం మొదలైంది
శత్రువు పదాతిదళ
మాకుమ్మడి ముట్టడి
వైరిమూకల శిరస్సులు
నా ఖడ్గానికి
గుట్టలు గుట్టలు
రణరంగం
రక్తప్రవాహం !
వ్యూహం మారింది
అశ్వారూఢుడనై
నా కరవాలం
మూకను చండుతూ
దాహార్తి
యుద్ధభూమికి
రక్తతర్పణం
ముట్టడి ఛిద్రమై
శత్రుసైన్యం
కకావికలం !
యుక్తిమారింది
గజవాహనమెక్కి
నా అస్త్రంవేటుకు కొందరు
గజపద ఘట్టంకింద
కొందరు
భీతావహులై
రణరంగానికి
వెన్నుచూపిన
విపక్షులు
ఎత్తుమారింది
లోహ విహంగంపై
అధిష్టించి
శత్రుశిబిరాలపై
కుండపోత
బాంబుల వర్షం కురిపించి
ఎగసిన
నా విజయకేతనం !
నా రాజ్యం
సామ్రాజ్యమైంది
రారాజై ఏలుకుంటాను
ఎక్కడ నా ప్రజలు
మనుషులు లేని
ఈ మరుభూమికి
ఇప్పుడు నేను
కాటికాపరిని
వీరబాహుడి
వారసుణ్ణి
సమవర్తి
కింకరుణ్ణి !

## నేను



సి. హెచ్. మధు
9949486122

నా గుండె ఆగిపోలేదు
ఈ గుండె ఆగిపోయేది కాదు
శత్రువు బలం -
బలహీనతలు నాకు తెల్సు
చీకటి అందాలు తెల్సు
వెలుగు దుఃఖః తెల్సు
నక్షత్రాల మెరుపు తెల్సు
అవి రాలటం తెల్సు
ఉదయం తెల్సు అస్తమయం తెల్సు
అస్తమయానికి గుండె ఆగిపోతుందా?
ఇది పోరాటం!
జీవన పోరాటం, స్వేచ్ఛకొరకు పోరాటం
వెలుగు కొరకు పోరాటం
శత్రువు ముందున్నాడు నాకు తెల్సు
అమవాస్యను లెక్కిస్తున్నాను
ఆ లెక్క ఎప్పటికీ వుండేది కాదు
ఉదయం ఎరుపులో
మండుతున్న గుండె నాది
శత్రువుదంతా నిన్నటిదినం
రేపంతా నా దినం

## 'అంతుచిక్కని వాడు

- అడపా రామకృష్ణ
9505269091

అవినీతికి పాల్పడడం
ఓ అలంకారం
నమ్మకద్రోహం
ఓ భూషణం
అహంకారం
ఓ భేషజం

వాడి ఆవిర్భావమే అవలక్షణం
విషబీజం మొలకెత్తే క్షణం
న్యాయం నగుబాటు కాని
చట్టం ఒక వెసులుబాటు అవని
బెయిల్ పొందడం స్టాటజ్
జైల్లో ఉండటం ప్రిస్టేజ్ ఇమేజ్
ప్రమాణాలపై ప్రాధాన్యమెంత
ఎటూతూగని తూనిక బరువెంత



న్యాయదేవత తీర్పు విలువెంత
తెల్లచొక్కాపై నల్లకోటైనా
వాడిమాటే నెగ్గాలి జత కట్టైనా

వాడెప్పుడు ఎక్కడ వుంటాడో
ఏ గాలిని ఎటు మళ్ళిస్తాడో
ఏ పయనం ఏ వేపు సాగుతుందో
ఏ గ్రాఫ్‌కీ అంతుచిక్కదు
అంతా తేట తెల్లమయ్యాక
వెదుకులాట మొదలయ్యాక
జారిపోతాడు నిశ్శబ్దంలోకి
నేటికీ లెక్కకి అందని సూర్యోదయాలు
ప్రతి ఉదయం ఓ సంచలనం

# తెలుగు నవలల్లో వృత్తి జీవన చిత్రణ








సహజంగానే నవలల్లో ప్రజల ఆచార వ్యవహారాలు, ప్రజల జీవన విధానాలు కన్పిస్తాయి. అందులో భాగంగానే కొన్ని నవలల్లో అంతర్లీనంగా వృత్తిజీవనం కన్పిస్తుంది. కాని వృత్తి జీవన ఇతివృత్తంతో పూర్తిగా వృత్తి జీవితాన్ని చిత్రించిన నవలలు కూడా వెలువడ్డాయి. వృత్తిజీవనంపై వచ్చిన నవలలు అరుదుగానే వచ్చినప్పటికీ, కొన్ని వృత్తులపై ఆధారపడి జీవిస్తున్న వారి జీవితాలను, వృత్తి మనుగడకై చేసే పోరాటాలను, అంతరించిపోతున్న వృత్తులతోపాటు అంతమవుతున్న వారి జీవితాలను చిత్రిస్తూ ప్రత్యేకతను చాటుకున్నాయి.

- మాచీడి సంతోష్ గౌడ్
9948351138

తెలుగు సాహిత్యరంగం సమాజాన్ని ప్రభావితం చేస్తూ, సమాజంతో ప్రభావితం అవుతూ కాలానుగుణంగా అనేక ప్రక్రియలుగా వెలుగొందుతూ వస్తుంది. అయితే సమాజాన్ని అత్యంత ప్రభావితం చేసినటువంటి ప్రక్రియల్లో మొదటగా పేర్కొనదగినది నవల ప్రక్రియ. 19వ శతాబ్ది ఉత్తరార్థంలో ''రాజశేఖర చరిత్ర''తో మొదలైన తెలుగు నవల అనేక ధోరణులతో ఇప్పటికీ మానవ సమాజాన్ని రంజింపజేస్తూ వస్తుంది. అదే క్రమంలో వృత్తి జీవనాన్ని చిత్రించిన నవలలు కూడా వెలువడ్డాయి. సహజంగానే నవలల్లో ప్రజల ఆచార వ్యవహారాలు, ప్రజల జీవన విధానాలు కన్పిస్తాయి. అందులో భాగంగానే కొన్ని నవలల్లో అంతర్లీనంగా వృత్తిజీవనం కన్పిస్తుంది. కాని వృత్తి జీవన ఇతివృత్తంతో పూర్తిగా వృత్తి జీవితాన్ని చిత్రించిన నవలలు కూడా వెలువడ్డాయి. వృత్తిజీవనంపై వచ్చిన నవలలు అరుదుగానే వచ్చినప్పటికీ, కొన్ని వృత్తులపై ఆధారపడి జీవిస్తున్న వారి జీవితాలను, వృత్తి మనుగడకై చేసే పోరాటాలను, అంతరించిపోతున్న వృత్తులతోపాటు అంతమవుతున్న వారి జీవితాలను చిత్రిస్తూ ప్రత్యేకతను చాటుకున్నాయి. అలాంటి నవలల్లో ముఖ్యంగా 2001-2010 దశాబ్దంలో వెలువడిన, రజక వృత్తిపై "పి.నాసరయ్య" రచించిన "ఉతికేసిన బతుకులు", గీత కార్మిక వృత్తిపై (గౌడ) "నేరెళ్ళ శ్రీనివాస్ గౌడ్" రచించిన "బతుకుతాడు", వ్యవసాయ వ్యవసాయ వృత్తిపై వసంతరావ్ దేశ్‌పాండే రచించిన "భూమి గుండ్రంగానే ఉండాలి", నాటకాల వారి జీవితాలపై ఐ.ఆర్.రాసాని రచించిన "బతుకాట", అలాగే నేత కార్మిక కుటుంబాల (పద్మశాలి)పై డా॥ కాలువ మల్లయ్య రచించిన "గువ్వల చెన్న", మరియు గుడ్డేలుగు (ఎలుగుబంటి)ను ఆడిస్తూ జీవించే దూదేకులపై పెద్దింటి అశోక్ రచించిన "జిగిరి' వాస్తవిక వృత్తి జీవితాలను చిత్రిస్తూ వెలువడ్డాయి. జోగినిలపై పి.శాంతి ప్రబోధ రచించిన "జోగిని" నవల ఒక దురాచార వ్యవహారాన్ని కళ్ళకు కట్టింది.

2001లో వెలువడిన పి.నాసరయ్య రచించిన "ఉతికేసిన బతుకులు" నవలలో కోస్తా ప్రాంత రజకుల యొక్క యదార్థవృత్తి జీవనం కన్పిస్తుంది. ఇది రజకులపై వచ్చిన మంచి నవల. రజక వృత్తిపై జీవిస్తున్న వారి జీవితాలలోని సమస్యలు, సంఘర్షణలకు ప్రతిరూపం ఈ నవల. కష్టాన్ని నమ్ముకుని జీవించే వృత్తి ఏ వృత్తికి తక్కువ కాదని, వృత్తిలోగల సమైక్య జీవనాన్ని తెలియజేస్తూ, ఆత్మగౌరవంగా బ్రతకడం ఈ నవలలో కన్పిస్తుంది. ఈ నవల కోస్తా ప్రాంత రజకులపై వచ్చినదే అయినా, కోస్తా, రాయలసీమ, తెలంగాణ ఏ ప్రాంతమైనా సరే పీడిత కులాలపై జరిగే అణచివేత, అకృత్యాలు, శ్రమదోపిడీలు, అకృత్యపు చర్యలలో తేడా లేదన్నది స్పష్టమవుతుంది. ఈ నవలలో ప్రధాన పాత్ర పేరయ్య. ఇతను అభ్యుదయ భావాలు గల వ్యక్తి. పేరయ్య రజకులందరిని ఏకం చేసి పెత్తందార్ల పోకడలను, దౌర్జన్యాలను అధిగమించడం కన్పిస్తుంది. శ్రమను నమ్ముకుని జీవించే వ్యక్తి ఆత్మగౌరవంగా బ్రతకాలే కాని, అవమానాలతో కాదనే పేరయ్య అభిమతం, ఊరి చాకిరి చేసి ఇంటింటికి తిరిగి తిండి ముద్దకోసం అడుక్కోవడం హీనమైన చర్య అని, తమ కష్టానికి సరైన ప్రతిఫలంగా ఏడాది చివరన ఇచ్చే ధాన్యం నెలనెలా ఇవ్వాలని డిమాండ్ చేయడం వంటివి పేరయ్యలోని ఆత్మగౌరవానికి నిదర్శనంగా కన్పిస్తాయి. ఈ నవల నిండా ప్రగతిశీల భావాలు కన్పిస్తాయి. పేరయ్య ఆదర్శవివాహం

చేసుకోవడం, స్టేజీ మ్యారేజీ, దుబారాఖర్చులు తగ్గించడం, పేరయ్య తన కూతురు, కొడుకుల క్కూడా ఆదర్శవివాహాలు చేయడం, స్త్రీ సమానత్వం వంటివి రచయిత యొక్క అభ్యుదయ దృక్పథాన్ని తెలియచేస్తాయి. భూమి పోయినా తమ రెక్కల కష్టంతో "ఇస్త్రీ"పెట్టెను నమ్ముకుని జీవించడమే కాదు, కబ్జాకు గురైన తమ చెఱువును పోరాడి సాధించుకున్న తీరు ద్వారా పీడిత కులాల వారు తిరగబడితే ఎలా ఉ ంటుందో రచయిత తెలియజేసాడు. పేరయ్య చదువుకోవడానికి పడినపాట్లు, అవమానాలు, మధ్యలో చదువు ఆపివేయాల్సిన పరిస్థితులు రజకుల యొక్క స్థితిగతులకు అద్దం పడుతుంది. ఉదయం లేవగానే భార్య, భర్తలిరువురూ ఊరు నుండి తీసుకు వచ్చిన బట్టలను మూటగా కట్టుకొని చెఱువుకు వెళ్ళడం, ఆడ, మగ తేడా లేకుండా పని భారాన్ని ఇద్దరూ పంచుకుంటూ, తమ శ్రమను మరచిపోవడానికి "ఉష్" అనే శబ్దం చేస్తూ ఉతకడం, మురికి, మలమూత్రాదులతో ఉన్న దుస్తులను శుభ్రం చేసస్తూ వాంతులు చేసుకోవడం, తమ అలసటను మరవడం కొరకు అందరూ కలిసి ఒకచోట కూర్చోని కబుర్లు, చమత్కారాలతో మధ్య మధ్యలో గడపడం వంటివి సహజ సిద్ధంగా కళ్ళకు కట్టినట్లు చక్కగా వర్ణించాడు రచయిత. అంతేకాకుండా ఉదయాన్నే అన్నం వండుకుని వెంట తీసుకుని వెళ్ళడం, తమ చంటి పిల్లలకు డేరాలు ఏర్పాటు చేసి పాలివ్వడం, ఆడించడం, మురికి చేతులతోనే వారు అన్నం తినడం వంటివి కరుణ రసాత్మకంగా కన్పిస్తాయి. రజకుల జీవితాలకు అద్దం పడుతుంది ఈ నవల.

గీతవృత్తి వారి బ్రతుకులపై వచ్చిన నేరేళ్ళ శ్రీనివాస్ గౌడ్ రచించిన నవల "బతుకుతాడు" నవల. తెలుగు సాహిత్యంలో గౌడకుల వృత్తి ఐన గీతవృత్తిపై వచ్చిన మొట్టమొదటి నవలగా దీనిని చెప్పవచ్చు. ఇందులో రచయిత కూడా ఒక పాత్ర కావడం విశేషం. ముప్పయి సంవత్సరాల కాలాన్ని తీసుకుని, ఈ ముప్పయి సంవత్సరాలలో గీత కార్మికులు బతికినా, ఇప్పటికి బతుకుతున్న బతుకులను గూర్చి రచయిత ఈ నవలలో చాలా చక్కగా చిత్రించాడు. ఈ నవల రచయిత జీవిత చరిత్రను తెలియపరుస్తుంది. ఈ నవలలోని ప్రధాన ఇతివృత్తం కరీంనగర్ జిల్లాలోని ఒక గ్రామంలో గీతవృత్తిని నమ్ముకుని కుటుంబమంతా కలసి తినడానికి ఒక పూట కూడా తిండికి నోచుకోని నారాయణ అనే నిరుపేద గౌడ్ యొక్క యదార్థ జీవన చిత్రణ కన్పిస్తుంది. ఈ నవలలో కులవృత్తిని నమ్ముకుని ఎటూకాని బ్రతుకు బ్రతుకుతున్న నారాయణలాంటి పాత్ర, అప్పులలో కూరుకుపోయి చెట్టు పన్ను కూడా కట్టలేని స్థితిలో ఆత్మగౌరవాన్ని చంపుకుని జీవిస్తున్న దుర్భర జీవితాన్ని కళ్ళకు కట్టినట్లుగా అద్భుతంగా చిత్రించబడింది. ప్రాణాలను ఫణంగా పెట్టి అతి ప్రమాదకరమైన



గీతవృత్తిని చేసుకుంటూ కూడా ఏ వృత్తికి లేని వృత్తి పన్నును ఈ గీతవృత్తికి చెల్లిస్తూ ప్రభుత్వ పన్నుతోపాటు, భూపెత్తందార్లకు పన్ను చెల్లించినా కూడా వారి ఆగడాలకు, తాళలేక వారి బెదిరింపులకు లోనవుతూనే తల్లి, పిల్లలతో సహా కూలీ చేసినా ఒక పూట తిండికి కూడా నోచుకోని నిరుపేద గౌడ్ అయిన నారాయణగౌడ్ కుటుంబం అత్యంత దుర్భర జీవితాన్ని అనుభవిస్తుంది. విధిలేని పరిస్థితుల్లో మధ్యలోనే చదువు మానేసి తండ్రికి చేదోడు వాదోడుగా నిలవడానికి చిన్నతనంలోనే కూలీపనులు చేస్తున్న నారాయణ కొడుకు శ్రీనివాస్, నీతిగా బ్రతుకుతూ నమ్మిన కులవృత్తిని వదలక, కులవృత్తిపై వచ్చే ఆదాయంతోపాటు భార్య, కూతురు, కొడుకు కూలీ పనులు చేసినా కూడా ప్రభుత్వ పన్ను కట్టలేని పరిస్థితుల్లో తనకున్న పాడిపశువులను అమ్మి ప్రభుత్వానికి పన్ను చెల్లించడం వంటి సంఘటనలు గీత కార్మికుల యొక్క సమస్యలకు అద్దం పడతాయి. అంతేకాకుండా ప్రకృతి వైపరీత్యాలకు కల్లు పారకపోగా ఆడకం తాగే వారితో బూతులు పడటం, పైనలు ఇవ్వనిదే కల్లుపోయ నందుకు దొర చేతిలో దెబ్బలు తినడం లాంటివి, ప్రభుత్వ పన్నుతోపాటు, చెట్టుపన్ను చెల్లించినా కూడా భూయజమాని తరచూ వేధింపులకు గురిచేస్తూ తాడిచెట్లు ఎక్కకుండా అడ్డుకోవడం. ఆ చెట్టుకు వచ్చిన కల్లును తానే లాక్కోవడం వంటివి గౌడ వృత్తి యొక్క శ్రమదోపిడీని, సమస్యలను, వారి దయనీయ జీవితాలను తెలియచేస్తాయి. అలాగే ఈ నవలలో నీతితో బ్రతికే నారాయణ లాంటి పాత్రతోపాటు, బొంబాయి వెళ్ళి వ్యాపారంలో లక్షలు సంపాదించుకునే నారాయణ సోదరుడు భూమయ్య పాత్ర కూడా కన్పిస్తుంది. అంతేకాదు కష్టం లేకుండా సీసాల కల్లు తయారీ చేస్తూ పట్నంలో అమ్ముకుని అవినీతిమయంగా కోట్ల రూపాయలు సంపాదించే కల్లు కాంట్రాక్టర్లు కూడా ఈ నవలలో కన్పిస్తారు. పట్నం వెళ్ళి వ్యాపారంలో లక్షలు సంపాదించే భూమయ్యగౌడ్‌లు వందలో ఒకరిద్దరుంటే, ఉన్న ఊరినే కన్నతల్లిగా, కులవృత్తినే దైవంగా భావిస్తూ తరతరాలుగా వస్తున్న వృత్తిని కాపాడుతూ బ్రతకలేక చావలేక కొట్టుమిట్టాడుతున్న నారాయణ లాంటి పేదగౌడ్‌లు ఎందరో ఉన్నారు. ఇప్పటికి నిరుపేదరికంలో

**భూయజమాని తరచూ వేధింపులకు గురిచేస్తూ తాడిచెట్లు ఎక్కకుండా అడ్డుకోవడం. ఆ చెట్టుకు వచ్చిన కల్లును తానే లాక్కోవడం వంటివి గౌడ వృత్తి యొక్క శ్రమదోపిడీని, సమస్యలను, వారి దయనీయ జీవితాలను తెలియచేస్తాయి.**

మగ్గుతున్నారు. గౌడవృత్తిని నమ్ముకుని జీవించే వారి పిల్లలు విధిలేని పరిస్థితుల్లో చదువును మధ్యలోనే ఆపివేసి కూలీలుగా మారుతున్నారనడానికి నిదర్శనం ఈ నవలలోని శ్రీనివాస్ పాత్ర. ప్రభుత్వ తోడ్పాటు లేకపోగా ఏ వృత్తికి లేనటువంటి వృత్తిపన్నును, అతి ప్రమాదకరమైన ఈ గౌడవృత్తికి విధిస్తూ గౌడ కులస్తులపై మోపుతున్న ఆర్థికభారాన్ని, ప్రభుత్వపు పోకడలను ఈ నవల అవగతం చేస్తుంది.

తరతరాలుగా వస్తున్న వృత్తిపై మమకారంతో ప్రేక్షకుల ఆనందమే తమకు ఆహారంగా భావిస్తూ, ముఖానికి రంగులద్ది ఆహార్యాన్ని ప్రదర్శిస్తూ నాటకాలు వేసుకుని జీవించే వారి యొక్క జీవితాలను చిత్రించిన నవల డా.వి.ఆర్.రాసాని రచించిన 'బతుకాట'. ఇందులో దాదాపు ఆరు తరాల వారి యొక్క జీవితం ఆవిష్కరించబడింది. ఈ నవలంతా రాయలసీమ మాండలికంలో ఉంటుంది. 2001 సంవత్సరంలో అమెరికాలోని "తానా" ఇచ్చే అవార్డు ఈ నవలకు లభించింది. చిత్తూరు జిల్లాలోని కుప్పం సమీపంలోని "యామినిపల్లె" గ్రామానికి చెందిన సిద్దప్ప అలియాస్ సిద్దోజి జీవిత చిత్రణమే ఈ నవలలోని ఇతివృత్తం. మొదటితరంకు చెందిన ఆది గురువు "అణ్ణావు వటేరావు"కాలం ఐదవ తరం వారైన సిద్దప్ప కాలం వరకు గల పరిస్థితులు, నాటకాలు వేసే వారి స్థితిగతులు, నాటకాలు ఆదరణలో గల మార్పులు, ఇబ్బందులు అన్ని ఇందులో చిత్రించబడ్డాయి. "అన్నావు వటేరావు" కాలంలో నాటకాలు వేస్తూ హాయిగా సాగిన కుటుంబం, సిద్దప్ప తరం వచ్చేసరికి ఆ వృత్తికి తగ్గిన ఆదరణ వల్ల ఎలాంటి మార్పులు చోటు చేసుకున్నాయో ఈ నవలలో కన్పిస్తాయి. ఉగాది నాడు మామిడితోపుకు వెళ్ళడం గజ్జెకట్టడం సాంప్రదాయం. మొదటి నాలుగు తరాలు ప్రదర్శనలిస్తూ, వివిధ ప్రాంతాల ప్రజలను అలరిస్తూ వారిచ్చే డబ్బుతో, ఇతర సామాగ్రితో వారి జీవితాలు హాయిగానే సాగాయి. సిద్దోజి తరం వచ్చేసరికి పరిస్థితులు పూర్తిగా దిగజారిపోయాయి. నాటకరంగంలో పోటీలు రావడం, ఆదరణ తగ్గడం వల్ల పూటగడవడం కూడా కష్టమైంది. అయినా తరతరాలుగా వస్తున్న వృత్తినే ఆస్థిగా భావించి, ఉన్న ఊరు వదిలి వెళ్ళలేక ఆ వృత్తినే నమ్ముకుని జీవించేవాడు సిద్దోజి. ఫలితంగా కరువుతో సిద్దప్ప కసాయివాడికి ఎద్దును అమ్ముకునే పరిస్థితులు ఏర్పడ్డాయి. సిద్దప్ప ఎద్దును కసాయి వాడికి అమ్మడం, లారీలో ఎక్కువ ఆవులు పెట్టడం కొరకు ఎద్దుకాళ్ళు విరగొట్టడం వంటివి, ఆ మూగ జీవాల ఆర్తనాదాలు కంటతడి పెట్టిస్తాయి. తన వృత్తికి ఆదరణ లేకపోయినా ఆ వృత్తిని రక్షించడం కొరకు ప్రేక్షకుల ఆనందమే పరమావధిగా నాటకాలు వేస్తున్న సమయంలో ఆకలితో అలమటిస్తూ ఆకలి బాధ తట్టుకోలేక సిద్దోజి చిన్న కుమారుడు మరణిస్తాడు. ఆ మరణ వార్తను తన గుండెల్లోనే దాచుకుని ప్రేక్షకులను ఆనందింప జేయడం వంటి సన్నివేశాలు సిద్దోజి వృత్తినిబద్ధతకు కొలమానంగా తలుస్తాయి. రంగస్థలం సిద్ధం చేయడం, రిహార్సల్స్, రాగం, తాళం, ఆహార్యం వంటి అన్ని ప్రదర్శనలు ఇందులో ప్రత్యేకంగా మనం చూస్తున్నట్లు అద్భుతంగా చిత్రించాడు రచయిత. పూట గడవడమే కాదు, తన కుటుంబం మొత్తం పనిచేసినా కనీసం తమ మొహాలకు వేసుకునే రంగుకు కూడా సరిపడని డబ్బులు వస్తున్నా, నమ్మిన వృత్తిని వదలక చివరకు ఆ వృత్తి కోసమే సిద్దోజి ప్రాణాలు విడవడం, ఈ నవల చదువుతున్నవారికి హృదయాలను ద్రవింపజేస్తుంది. నాటకాలు వేసుకునే వారి కన్నీళ్ళు, కష్టాలు, ఆకలి కేకలు, మరియు ఎంతటి బాధనైనా పంటి బిగువున దాచుకుని తమ ముఖ కవళికల్తో, హావభావాలతో ప్రేక్షకులను రంజింపజేయడం, ఆ రంగులవెనక వారి జీవితాల్లో ఎంతటి విషాద ఛ్ఛాయలున్నాయో ఈ నవలలో ప్రతిబింబిస్తాయి. నాటకాలు వేస్తూ సమాజాన్ని మేలుకొలిపే సిద్దోజీ లాంటి ఎందరో కళాకారుల జీవితాలు అర్థాకలితో అలమటిస్తూ ఆర్తనాదాల మంటల్లో నాటకీయంగానే ముగుస్తున్నాయి అనడానికి ఈ నవల నిలువుటద్దంగా నిలుస్తుంది.

**నాటకాలు వేస్తూ సమాజాన్ని మేలుకొలిపే సిద్దోజీ లాంటి ఎందరో కళాకారుల జీవితాలు అర్థాకలితో అలమటిస్తూ ఆర్తనాదాల మంటల్లో నాటకీయంగానే ముగుస్తున్నాయి అనడానికి ఈ నవల నిలువు టద్దంగా నిలుస్తుంది.**

దేశానికి అన్నం పెట్టే రైతన్నకే పట్టెడన్నం దొరకని దుస్థితిని తెలియజేసే నవల వసంతరావు దేశ్‌పాండే "భూమి గుండ్రంగానే ఉండాలి". తెల్లబంగారమైన పత్తి రైతులపాలిట విపత్తుగా మారి వారి కంట కన్నీరు పెడితే, కన్నీరు కాదు దానిని ఎదుర్కొని నిలబడాలి అనే సందేశాన్ని ఇస్తుందీ నవల. ఇందులో ప్రధాన పాత్రధారి బక్కన్న అనే రైతు. బక్కన్న వాణిజ్యపంట అయిన పత్తిపంట వేసి పంటకు పట్టిన చీడ పురుగులు తొలగించడం కొరకు లక్షలు అప్పులు చేసి చివరకు ఫలితం లేక ఆ పంటకే నిప్పుపెట్టడం, ఆ తర్వాత తను ఆత్మహత్య ప్రయత్నం చేయడం రైతుల యొక్క ఆవేదనకు అద్దం పడుతుంది. బక్కరైతు అయిన బక్కన్న ఉన్న రెండెకరాల పొలాన్ని తన భార్యతో కలసి దున్ని, పొలాన్ని చదును చేసుకుని, పత్తి పంట వేస్తాడు. ఆర్థిక ఇబ్బందులతో ఉన్న రెండు ఎడ్లను అమ్ముకుని తానే ఎద్దుగా మారి దున్ని పంట వేస్తే, చీడపురుగు పట్టి లక్షలు అప్పులు తెచ్చి వాటిని తొలగిస్తే, చివరకు పత్తి పండక పోడము చేత పంటకే నిప్పుపెట్టడం అతని ఆవేదనకు నిదర్శనం. హైబ్రీడ్

విత్తనాలతో దళాలరుల చేత మోసపోయిన బక్కన్న లాంటి బక్కరైతులు ఎందరో ఆత్మహత్యలకు బలైపోతున్నారు. రాబోయే కాలంలో మన దేశీయ పంటలు పండాలంటే మన దేశీయ విత్తనాలు వాడాలని, అంతరించిపోతున్న దేశీయ విత్తనాలను సేకరించి భద్రపరచాలని రామకృష్ణ అనే పాత్ర ద్వారా చక్కగా తెలియజేశాడు రచయిత. అంతేకాదు. బక్క రైతుల పక్కన నిలబడి రైతుల యొక్క శ్రేయస్సును కోరే, దళారులను నిలదీసే విశ్వనాథం లాంటి పాత్రలు కూడా ఇందులో దర్శనమిస్తాయి. దళారులు అమాయక రైతులను నమ్మించి విదేశీ విత్తనాలు నాటించడం, ఆ తర్వాత అవి పండకుండా రైతుల పాలిట శాపంగా మారడం. అప్పులు తెచ్చినకాడ వడ్డీలు పెరగడం వంటివి నిజజీవితపు రైతును తలపిస్తాయి.

అంతేకాకుండా ప్రస్తుత పరిస్థితులలో ఎలాంటి పంటలు వేస్తే గ్రామాలు అభివృద్ధిలో నడుస్తాయో, దానికి వ్యవసాయ అధికారులు, ప్రభుత్వం, రైతుల సహకారం ఎలా ఉండాలో కూడా ఉదాహరణ పూర్వకంగా సూచించాడు రచయిత.

అలాగే డా॥ కాలువ మల్లయ్య రచించిన “గువ్వలచెన్న” నవలలో, నేత వృత్తిని ఆధారం చేసుకుని జీవిస్తున్న పద్మశాలుల జీవితాలు చిత్రించబడ్డాయి. చేనేత వృత్తినే నమ్ముకుని జీవిస్తున్నవారు వారి ఉత్పత్తులకు గిరాకీలేక ఇల్లు గడవక నమ్మిని వృత్తిని వదలలేక, అప్పుల ఊబిలో పడి చివరకు ఆత్మహత్యలు చేసుకోవడం ఈ నవలలో కన్పిస్తుంది. అలాగే నమ్మిన వృత్తి అన్నం పెట్టలేని స్థితిలో దాన్ని వదిలి వలసలు వెళ్ళి వలస జీవితాలతో అనారోగ్యం పాలై ఊరు కాని ఊరిలో దేశంకాని దేశంలో మగ్గుతున్న వారి జీవితాలు కూడా కన్పిస్తాయి. అప్పులు చేసి వలసలు వెళ్ళినవారు, తిరిగి అప్పులు చెల్లించలేని స్థితిలో ఆత్మహత్యలు చేసుకున్న వారి కుటుంబాల యొక్క దీనస్థితి కూడా ఈ నవలలో కన్పిస్తుంది. అయితే ఆకలిని జయించడానికి వెళ్ళిన వలసలు, చదువుకుని చైతన్యం పొందిన తర్వాత వెళ్ళిన వలసల మధ్య తేడాని రచయిత చాలా చక్కగా వివరించాడు.

**అప్పులు చేసి వలసలు వెళ్ళినవారు, తిరిగి అప్పులు చెల్లించలేని స్థితిలో ఆత్మహత్యలు చేసుకున్న వారి కుటుంబాల యొక్క దీనస్థితి కూడా ఈ నవలలో కన్పిస్తుంది. అయితే ఆకలిని జయించడానికి వెళ్ళిన వలసలు, చదువుకుని చైతన్యం పొందిన తర్వాత వెళ్ళిన వలసల మధ్య తేడాని రచయిత చాలా చక్కగా వివరించాడు.**

దూదేకుల వారి జీవితాలపై వచ్చిన మంచి నవల, పెద్దింటి అశోక్ రచించిన “జిగిరి” నవల. ఇందులో మూగ జీవాలను మచ్చిక చేసుకుని వాటిని ఆడిస్తూ, వాటిపై ఆధారపడి జీవించే దూదేకుల వారి జీవితాలు చిత్రించబడ్డాయి. మూగ జీవైన ఎలుగుబంటిని మచ్చిక చేసుకుని దానిని ఆడిస్తూ పొట్టపోసుకునే దూదేకుల వాడి జీవితమే ఈ “జిగిరి” నవల. గుడ్డేలేగు (ఎలుగుబంటి)ను ఆడిస్తూ బ్రతికే వారి కష్టాలు, కన్నీళ్లు, ఇబ్బందులు ఇందులో దర్శనమిస్తాయి. అదేవిధంగా సమాజంలో హేయమైన దురాచారమైన జోగిని వ్యవస్థపై వచ్చిన చక్కని నవల వి. శాంతి ప్రబోధ రచించిన “జోగిని” నవల. తరతరాలుగా ఆచారంగా వస్తున్న దురాచారమైన జోగిని వ్యవస్థ కళ్ళకు కట్టినట్లు చిత్రించింది ఈ నవల. ఇందులో నాలుగు తరాలకు సంబంధించిన జీవితాలు కన్పిస్తాయి. ఆచారపు కట్టుబాట్లకు బలైపోయిన పోచవ్వ, ముత్తెమ్మ, నాయవ్వ, పోచీ అనే జోగిని స్త్రీల జీవితాలు ఇందులో కన్పిస్తాయి. తనకు ఇష్టంలేని జోగిని వ్యవస్థకు దూరంగా ఆత్మగౌరవంగా బ్రతుకుతున్న “పోచీ” సమాజపు కట్టుబాట్లతో, పెత్తందార్లు, భూస్వాముల ఆగడాలతో బలైపోయిన తన భర్త మరణం తర్వాత తనకు తెలియకుండానే తన ఇష్టాయిష్టాలతో పని లేకుండా “జోగిని”గా మార్చింది ఈ సమాజం. ఎల్లమ్మకో, పోచమ్మకో పెళ్ళిచేయడం ఆ తర్వాత ఊరందరికి భార్య కావడం, తన మనసు, ఇష్టంతో పనిలేకుండా ఊరందరి భార్యగా తన శరీరంపై అధికారాన్ని కోల్పోయి అందరిని ఆనందింపజేయడవే ఈ జోగినిల కర్తవ్యం. తండ్రి ఎవరో తెలియకుండానే జోగిని కడుపులో పుట్టిన పాపానికి తమ ఇష్టాలతో పనిలేకుండా తరతరాలుగా వస్తున్న దురాచారం ప్రకారం కట్టుబాట్లకు లోబడి, తల్లితోపాటు బిడ్డకూడా జోగినిగా మారాల్సిందే. జోగిని కూతురు జోగినిగా మిగిలిపోవాల్సిందే. ఇలాంటి జోగిని వ్యవస్థపై పరిశోధన చేయదలచి వచ్చిన విద్య అనే అమ్మాయి పోచీని కలిసి ఈ వ్యవస్థను గూర్చి క్షుణ్ణంగా పరిశీలించి, ఈ వ్యవస్థలో మార్పు తీసుకురావడం కొరకు జోగిని వ్యవస్థ రద్దుకొరకు ప్రభుత్వానికి నివేదిక ఇస్తుంది. దీని ఫలితంగా కొన్నాళ్ళకు పోచవ్వ కూతురు సబిత తరం నాటికి మార్పువచ్చి, ప్రభుత్వం చట్టాలు చేయడం, జోగిని వ్యవస్థ రద్దుకావడం జరుగుతుంది. ఆ తర్వాత పోచీ ఎన్నికలలో నిలబడి సర్పంచ్‌గా గెలవడంతో నవల సమాప్తం అవుతుంది. ఈ నవల ఆద్యంతంగా నిజామాబాద్ జిల్లాలోని ఒక ప్రాంతంలోని జోగిని వ్యవస్థకు సంబంధించిందే అయినా, ప్రభుత్వం ఎన్ని చట్టాలు చేసినా దేశంలో ఎక్కడో ఒకచోట ఇలాంటి దురాచార వ్యవస్థ ఇప్పటికీ కొనసాగుతూనే ఉంది. మూఢాచారాలతో, కట్టుబాట్ల పేరుతో అంధ విశ్వసంతో ఉన్న ప్రజల్లో చైతన్యంతో కూడిన పూర్తిగా మార్పు వచ్చేవరకు ఇలాంటి వ్యవస్థలు కొనసాగుతూనే ఉంటాయి. ప్రభుత్వం ఎన్ని కఠిన చట్టాలు చేసినా, మూఢ ఆచార సమాజంలో మార్పు రానంత వరకు నిరుపయోగమే.

పైనవలల్ని పరిశీలించినట్లయితే వృత్తినే నమ్ముకున్న వారి జీవితాలు కాని వారి సంస్కృతిలో కాని, ఎలాంటి అభివృద్ధి, మార్పు కన్పించదు. "బతుకుతాడు", "ఉతికేసిన బతుకులు", "గువ్వలచెన్న" నవలల్లో గౌడ, రజక, పద్మశాలి వారి జీవితాలు గమనిస్తే వారు ఇంకా సమాజంలో ఉన్నత స్థానం చేరుకోలేని స్థితిలో ఉన్నారనిపిస్తుంది. అలాగే "జిగిరి", "బతుకాట", 'జోగిని" నవలల్లో దూదేకుల, నాటకాలు వేసేవారు, జోగినిలు సమాజంలో హేయమైన స్థితిలోనే బ్రతుకు తున్నారనిపిస్తుంది. భూమినే నమ్ముకుని జీవించే బక్కరైతులు అప్పుల ఊబిలో చిక్కుకుని ఇంకా సమాజంలో అధమ స్థానంలోనే ఉన్నారనడానికి "భూమి గుండ్రంగానే ఉండాలి" నవలే నిదర్శనం. అనేక వృత్తుల సమ్మేళనమైన మానవ సమాజంలో వస్తుమార్పిడి వ్యవస్థ నుండి నేటివరకు వృత్తులనే నమ్ముకుని జీవిస్తున్న వారి జీవితాలలో గణనీయమైన మార్పులు రాలేదు సరికదా, తరతరాల నుండి వస్తున్న వృత్తులు అంతమయ్యే పరిస్థితి ఏర్పడింది. ఇలాంటి పరిస్థితుల్లో నమ్ముకున్న వృత్తిని వదలలేక, వేరే వృత్తులను చేపట్టలేక అరకొర జీవితాలతో బ్రతుకును కొనసాగిస్తున్నారు, కమ్మరి, కుమ్మరి, వడ్రంగి, రజక, గీత, నేత కార్మికుల వంటి వృత్తుల వారు, కొంతమంది జీవిత ఒడిదుడుకుల సంఘర్షణలో సతమతమవుతూ ఆత్మహత్యలు చేసుకోగా, మరికొంతమంది ఇతర ప్రాంతాలకు వెళ్ళి దుర్భర వలస జీవితాలను అనుభవిస్తున్నారు. సమాజంలో ఇలాంటి వృత్తులకు సరియైన ఆదరణలేకపోవడం, ప్రభుత్వ తోడ్పాటు అందకపోవడం, పారిశ్రామీకరణం చెందడం, ప్రకృతి వైపరీత్యాలు వంటివి వీరి వెనుకబాటుకు కారణాలుగా చెప్పవచ్చు. అలాగే శాస్త్ర సాంకేతికంగా అభివృద్ధి చెందుతున్న ఈ పరిస్థితుల్లో కూడా దురాచారమైన "జోగిని"లాంటి వృత్తులను నమ్ముకుని జీవిస్తున్న వారు కూడా ఉన్నారు. వీరి వెనుకబాటుకు అవిద్య, అంధ విశ్వాసాలు, మూఢాచారాలు, మత పోకడలు కారణాలుగా చెప్పవచ్చు. వేగంగా అభివృద్ధి చెందుతున్న నేటి సమాజంలో వృత్తినే నమ్ముకుని జీవించేవారి జీవితాల్లో, వారి సంస్కృతిలో ఎలాంటి మార్పు, అభివృద్ధి కన్పించకపోగా, దేశానికి పట్టుకొమ్మలైన గ్రామాలు, పారిశ్రామికీకరణమనే అభివృద్ధి ముసుగులో ధ్వంసం అవుతున్నాయి. దాని పర్యావసానంగా గ్రామీణ కుల వృత్తులు కుంటుపడుతున్నాయి. గ్రామాల నుంచి పట్టణాలకు వలసలు పెరుగుతూ, వృత్తులు కనుమరుగవు తున్నాయి. "వివిధ అంగాలతో నిర్మితమైన శరీరం లాగా వివిధ వృత్తులతో నిర్మితమైంది సమాజం" అలాంటి సమాజంలో వృత్తులు ఒక్కొక్కటిగా కనుమరుగవుతున్న తరుణంలో "సాహిత్యం-సమాజహితం"గా అంతమవుతున్న వృత్తులను ఆదుకోవాలనే పై నవలలు వెలువడడం హర్షణీయం. అయితే వృత్తులను పరిరక్షించుకోవడానికే కాకుండా, అంతమవుతున్న, అంతమైన వృత్తులు భవిష్యతరాలకు తెలియడం కొరకైనా ఇలాంటి రచనలు ఎంతగానో ఉపకరిస్తాయి.



## గజల్

ఖైరి ఇందిర
7396303552

వెలిగే దివ్వెలనార్పే వికృతవాదం ఏమిటిది
విరిసే నవ్వుల చిదిమే పెను ఉన్మాదం ఏమిటిది

అడవుల గడిచీ నాగరికతలకు పాదులు వేశావే
మారణహోమం నడిపే హింసా పాదం ఏమిటిది



స్వేచ్ఛాజగమున ఊయలలూగే సమయాన
రెక్కలే తెగిపడి రక్కపుటేరుల ప్రమాదం ఏమిటిది

మనిషితనాన్నే దాలిచి బలిమిగ తలచే కాలాన
కలలే కన్నీరై మిగిలిన నిర్వేదం ఏమిటిది

మనుగడ కొమ్మన మానవ జాతే పైపైకెదగాలి
పాతాళానికి దిగబడు ఈ నరమేధం ఏమిటిది

(పాకిస్తాన్ పాఠశాలలో జరిగిన ఉగ్రవాద దాడిలో నేలకొరిగిన బాలలు ఇతర సిబ్బందికి నివాళులర్పిస్తూ...)

## అస్త్రాక్షరాలు



జానిపాష
8106289362

బ్రతుకు నిత్య సమరమే
ప్రతిక్షణమూ యుద్ధ సమయమే
న్యాయాన్యాయాల బేరీజు వేసే తరాజు...
అరాజకీయుల తావీజై...
ఆకటి పేగులే తాళ్లుగా ఊగే తక్కెడ,
న్యాయదేవత గంతలను
శాశ్వత సంకెళ్ళు చేసి
అశాశ్వత నీతి నియమ
యమ గతుల సరిదిద్దగల
తరగతుల్లో అక్షరాలతో బాటు
గుప్పెడు అస్త్రాల్నీ గుణించి
వల్లె వేయిద్దాం

## మార్పు అనివార్యం

గోపగాని రవీందర్
9440979882

బహుముఖాల ప్రదర్శనలో
అసలు, నకిలి, వంచన ముఖాల్ని
పసిగట్టడం కష్టసాధ్యమైన పరీక్షే
కొద్దిగా అటుఇటుగా గుర్తు పట్టిన
జాగ్రత్తగా మసలుకుంటాం కదా
యంత్రంకు తనదైన ఆలోచన లేదు కాబట్టే
ఏది చేయమంటే అదే చేసి గర్వంగా నిలుస్తుంది
మనిషనే ప్రాణమున్న యంత్రం మాత్రం
అంశాలను బట్టి తన ప్రాధాన్యతలను
అతి సులువుగా క్షణాల్లో మార్చుకుంటుంది
అంతే తేడా మిత్రమా! ఇది అర్థం కాక
అనవసర తండ్లాటలో ఇరుక్కొని
నమ్ముకున్న వాళ్ళు ద్రోహం చేశారని
కుమిలి కుమిలి కలతచెందడమెందుకు?
ఎదిగే మొక్క ఆకాశం వైపే చూడాలి
మేఘాల్లోని నీటి చుక్కలు నేలపైనే పడాలి
చెట్టుకు పండిన పండ్లు కిందనే పడాలి
ప్రవహించే నదులన్నీ సముద్రం వైపే సాగాలి
వాటికి మరో ప్రత్యామ్నాయం లేదు



మనిషి స్వభావానికి ఇవ్వలేం హామీని
అందుకే అంటున్న మార్పు అనివార్యం
తనకు నచ్చితే ఎవరెస్టును ఎక్కిస్తాడు మాటలతో
నచ్చకపోతే నిస్సుగ్గుగా తోస్తాడు లోయలోకి
అందర్నీ ఒకేలా చూడద్దనుకున్న
మనిషిని పోలిన మనిషి వుండొచ్చు కాని
స్వభావాన్ని పోల్చదగిన వాళ్ళు అరుదు మిత్రమా!
నయారక్కసులతో జాగ్రత్త
ఆదమరిచే ఒక్క నిముషం చాలు ఊబీలోకి తోస్తారు
అభయ హస్తాలనిచ్చే ఆపద్బాంధవులకై చూడకు
అప్రమత్తతే నీకు నాకు మనకు రక్షణ కవచం
మిత్రమా జాగ్రత్త...! దేనికైనా.. మార్పు అనివార్యం...!




# బండరాయి

- విజయభాను కోటి
9502247679

"రాలిపడిన పువ్వులా అభద్రతా భావం ఆమె కళ్ళలో....

రక్తం చిమ్మిన గాయంలా చారలు కట్టిన బుగ్గలు చితికిపోయిన ఆ పెదాలు ఎంత అందంగా ఉన్నాయని....అసలే వర్షం వెలిసిన ఉదయం!

మబ్బుల భారాన్ని ఆమె జీవితంలోకి నెట్టిన ఉదయం!" ఎక్కడ అమలాపురం? ఎక్కడ అస్సాం!

ఊర్లో పొలం అమ్మడానికి తాత కావాల్సి వచ్చాడు. తాతను ఇక్కడికి తీసుకొచ్చిన పెదనాన్న ఇంటికొచ్చాడు తను. తాతను పంపమంటే వాటా కన్నా ఎక్కువ కావాలన్నాడు పెదనాన్న. కలికాలం. ఇవ్వక చస్తానా? పొలం అమ్మకపోతే చస్తాను గానీ!

తాతను రేపు తీసుకెళ్ళిపోవాలి. ఈ రోజు కాస్త అస్సాం అందచందాలు చూద్దామని ఇంట్లోనుండి బయటికి వచ్చాను.

చుట్టూ కొండలు, వెదురుతో ప్రహరీలు, ఇళ్ళు...అక్కడక్కడా ఒకే ప్రవాహం తో సాగే వాగులు...బావుంది ఆ ప్రదేశం.

దూరంగా కనిపిస్తున్న కొండలు నన్ను పిలుస్తున్నట్టే ఉంది. అటు వైపు నడిచాను. కొండలు చేరాలంటే మేమున్న టౌను దాటి, చిన్న అడవి లాంటి ప్రదేశం దాటి వెళ్లాలని అక్కడి షాపు లోని వ్యక్తి చెప్పాడు. ఇంకేదో చెప్పజూసాడు గాని, కొండల పిలుపుల ధ్వని ఎక్కువై అతగాని మాటను నేను వినలేదు.

టౌను దాటబోతున్నంతలో జరిగిందా సంఘటన! ప్రక్కనున్న వాగులో ప్రయాణించి వచ్చిన బోటు లోంచి బిల బిల మంటూ ఒక ఐదుగురు మనుషులు దిగారు.

చూస్తున్నంతలోనే వారి చేతుల్లో తుపాకీలు మెరిసాయి. ఎవర్ని ఎయిమ్ చేసారో తెలియదు. చూస్తుండగానే తివాచీల దగ్గర బేరసారాలు చేస్తున్న ఇద్దరు వ్యక్తులు నేలకొరిగారు.

ప్రజలు పరుగులు తీసారు. ఎవరు ఎటు పరుగు పెడుతున్నారో తెలియదు.

నేను కూడా పరుగు పెట్టాను. ఆగకుండా పరుగెడుతూనే ఉన్నాను. కొంత సేపటికి అలుపొచ్చి ఒక చెట్టుకు జారబడిపోయాను. చుట్టూ చూద్దును కదా....గుండె గుభిల్లుమంది.

చీకటి పొర అప్పటికే ఆకాశాన్ని కమ్మేసింది. అది కాదు నాకు భయాన్ని కలిగించింది. నేను పరుగు పెట్టింది అడవిలోకి. చుట్టూ దట్టమైన చెట్లు మాత్రమే కనిపిస్తున్నాయి.

ఇపుడేం చెయ్యాలి?

తిరిగి టౌను లోకి వెళ్ళాలా? అక్కడి పరిస్థితి ఎలా ఉందో తెలీదు. చెట్టుకి మళ్ళీ జారబడిపోయాను

తొక్కలో సౌందర్యోపాసన ఇంత చేటు తీసుకొచ్చింది. మా అమలాపురం లో లేవా ఏమి ఈ కొండలు, గుట్టలు....

అలా కొంత దూరం ఇంకో వైపుకు పోతే తేయాకు తోటలున్నాయట. అక్కడికైనా పోయాను కాదు.

కాసిన్ని తెయాకులైనా కొని ఇంటికి పట్టుకుపోదును. అన్నయ్య అంటూనే ఉన్నాడు, అస్సాం లో పరిస్థితులు బాలేవురా! ఒకటే గొడవలు...మావోల కాల్పులని! బోడోల యుద్ధాలనీ....

పెదనాన్నేమో ఇక్కడేమి లేవు రమ్మన్నాడు. అవును మరి! ఆయన ఆంధ్రప్రదేశ్ రాలేడు. చవగ్గా నేనొస్తే తాతనిచ్చి పంపించొచ్చు, ఆయనగారి కష్టమేమి లేకుండానే, ఆస్తులు అమ్మాక డబ్బు నేనే తెచ్చిస్తాగా!

తెలివితేటలు! నాకు మాత్రం లేవా ఏంటి?

అమ్మను ఏమార్చి ఇన్నాళ్ళూ ఆస్తులన్నీ అమ్ముకు తినలేదూ? ఇపుడు నా సౌందర్యోపాసనకూ, విచ్చలవిడి తిరుగుళ్ళకూ అమ్మ ఆస్తి తరిగిపోయి, అప్పులపాలయ్యాక తాత గుర్తొచ్చాడు. తాత పేరుతో ఊర్లో ఉన్న ఎనిమిదెకరాల కొబ్బరితోట గుర్తొచ్చింది.



పెదనాన్న ఒప్పుకునే వాడే కాదు ఇపుడు అతగాని చిన్న కూతురి పెళ్లి లేకపోతే! నాకు కూడా ఆయన అవసరం కలిసొచ్చింది.

తాత గొణుగుతూనే ఉన్నాడు. రాత్రి మేమంతా విననట్టే నటించాం! సరే! ఇపుడెలా మరి?

ఈ రాత్రి ఈ అడవిలో తెల్లారాల్సిందేనా? సినిమాల్లో చూపించినట్టు నా భయానికి తగ్గట్టే, వర్షం మొదలైంది.

అయిపోయింది. ఏం సేతురా భగవంతుడా..... చెట్టెక్కి కూర్చోవడమే మార్గం. ఈ చెట్టేదో కాస్త గుబురుగా బానే ఉంది. ఎక్కి రాత్రి జాగారం చేస్తే సరి.

టౌనులో అల్లర్లు సద్దుమనిగాయో లేదో... ఆ మావో మూక కాస్తా ఈ అడవిలోకే వస్తే....నన్ను చెట్టు కింద చూస్తే...ఇక నా పని సరి!

ఇలా అనుకోవడం పాపం చెట్టు ఎక్కే పనిలో పడ్డాను. జల్లు పడుతున్నందుకో, చెట్టెక్కి చాలా కాలమైనందుకో తెలీదు కానీ....కష్టంగానే ఉంది.

ఇంతలో చెట్టు వెనుక ఏదో శబ్దం. నా గుండె వెయ్యి రాజధాని ఎక్స్ ప్రెస్సులు ఒకేసారి వెళ్తున్నంత స్పీడులో కొట్టుకుంటోంది. ఈ మవోలేందుకు తయారౌతారో కదా!

జనాలకి వీళ్ళంటే భయమా లేక భక్తా? నాకైతే పిచ్చ భయమేస్తోంది. చెట్టు ఎక్కే ప్రయత్నాన్ని ఆపి, బల్లిలా చెట్టుకి అతుక్కుపోయాను. వర్షం ఆగింది. వెన్నెల పరచుకుంది అడవంతా....చెట్టు వెనుక అలికిడి ఆగింది. నాకెందుకో అనిపించింది అటువైపు కూడా ఎవరో నాలాగే ఈ అల్లర్లకు పారిపోయి వచ్చిఉంటారేమో! కొంచెం ధైర్యం చిక్కబట్టుకుని, నెమ్మదిగా అటువైపు తొంగి చూసాను. వెన్నెల ఎందుకలా వర్షం వెనుకే అడవంతా పరుచుకుపోయిందో అప్పుడు అర్థమైంది నాకు! ఈమె నాకు కనపడాలనే! సందేహం లేదు!

చెట్టుకు అటువైపు నా లాగే బల్లిలా అతుక్కుపోయి ఉందామె! ఊపిరి కూడా ఆగి ఆగి నెమ్మది గా తీసుకుంటోంది ఇటున్న నాకు వినిపిస్తుందేమోనని....నాకు మహా ధైర్యం వచ్చేసింది. చెట్టుకు అవతలివైపు ఒక గెంతు గెంతాను. డౌటు లేదు...నాకు మహా ఉత్సాహం వచ్చేసింది!

ఆమె నన్ను చూసి చెట్టుకి ఇంకా దగ్గరగా అతుక్కుపోయింది. బెదురు బెదురు చూపులతో లేడి పిల్లలా....

అబలను చూస్తే మీసాలు రాని వాడికి కూడా హీరోననిపిస్తుంది. నాకెందుకు అనిపించదు?

''భయపడొద్దు. నేను మావోని కాదు.'

'నా డైలాగ్ పని చేసింది. ఆమె కాస్త ముందుకొచ్చింది.

అయినా ఆమె శరీరం వణుకుతూనే ఉంది.

'అల్లర్లకు భయపడి పారిపోయి వచ్చారా?'

'నా ప్రశ్నకు కాదన్నట్లు తల ఊపిందామె...

ఇపుడు నాకు వణుకు మొదలైంది... చిన్నపుడు అమ్మమ్మ దెయ్యాల కథలు తెగ చెప్పేది. వాటిల్లో ఆమె స్వీయానుభావాలే ఎక్కువ...విన్నప్పుడు సరదాగానే ఉండేది. తర్వాతే నిద్ర పట్టేది కాదు...నాకు చిన్నప్పుడు టీవీ లో చూసిన జగన్మోహిని సినిమా గుర్తొచ్చింది. తటాలున ఆమె కాళ్ళ వైపు చూసాను. చీర కుచ్చెళ్లు కాళ్ళను కప్పేసి ఉన్నాయి. ఎలా కనిపెట్టడం? తెల్లటి ఛాయ! భలే ఉంది ఆమె ముఖం. చంద్రబింబంలా గుండ్రటి బొట్టు, లోనెక్ జాకెట్టు....వర్షానికి వంటికి అతుక్కుపోయిన చీర..... నాదసలే ముప్పిరిగొన్న రస హృదయం!

"మీరు తెలుగా?' 'ఆమెను నఖశిఖ పర్యంతం పరిశీలిస్తూ దెయ్యం ఏమో అన్న విషయాన్ని క్షణ కాలం మర్చిపోయాను.

ఆమె ప్రశ్నకు ఈ లోకంలోకి వచ్చి పడ్డాను.

ఆమెను చూస్తే తెలుగు అమ్మాయిలా లేదు. ఖచ్చితంగా కాదు. మరి తెలుగెలా మాట్లాడుతోంది?

నా అనుమానపు చూపుల్ని పసిగట్టినట్టుంది.

"నేను కొన్నాళ్ళు హైదరాబాదులో ఉన్నాను. అప్పుడు తెలుగు నేర్చుకున్నాను." నా సందేహాన్ని తీర్చింది.

"ఇక్కడ బాలేదు. కొంచెం దూరం నడుద్దామా?" అడిగాను నేను.

అప్పటివరకూ చెట్టు ఎక్కేద్దామనే కదా అనుకున్నాను! ఏమిటో ఇపుడు ఈ ధైర్యం!

ఆమె సరేనన్నట్టు తల ఊపింది.

వెన్నెల ఆమె అడుగులకు దారి చూపుతోంది. నేను ఆమెను అనుసరించాను.

"ఈ దారి తెలుసా?" అడిగాను

"ఉహు! తెలీదు. అస్సాంలో ఇది రెండో రోజు నాకు. ఇక్కడేమి తెలీదు.'

'కాలిబాటలా ఉన్న దారంట నడవడం మొదలు పెట్టిందామె!

పెద్ద దారి వదిలి ఈ దారెందుకో...

"కాలిబాట అంటే ఇటు ఇల్లేమైనా ఉండొచ్చు లేదా ఊరైన తగలొచ్చు కదా?" నేను అడగకుండానే చెప్పింది.

"పల్లెటూర్లో పుట్టి పెరిగావ్...అడ్డ గాడిదా...ఈ మాత్రం ఊహించలేవా?" నన్ను నేనే తిట్టుకున్నాను.



కొంత దూరం నడిచాక ఇల్లు తగల్లేదు కానీ పెద్ద బండరాయి మాత్రం కనిపించింది. ఎవరో వెన్నెల రాత్రులు పడుకోవడానికి చెక్కుకున్నట్లు భలే అందంగా ఉంది.

ఆమె ముఖంలో సంతోషం వచ్చింది. ఇద్దరం కాస్త శ్రమ పడి ఆ రాయినెక్కి కూర్చున్నాం. పైన వెన్నెల, క్రింది వెన్నెలా రెండూ బావున్నాయి. వెన్నెల అనేది ఆమెకు నేను పెట్టుకున్న పేరు! ఆమె చేతిలో చాలా చిన్న మొబైల్ ఉంది. సన్నగా, చిన్నగా....గుప్పెట్లో ఇమిడిపోయేంత.. ఆమె ప్రతి ఐదు నిముషాలకూ ఒకసారి గుప్పెట తెరిచి మొబైల్ చెక్ చేస్తోంది.

"మీరు అడవిలోకి ఎలా వచ్చారు? అల్లర్ల సమయంలో పారిపోయారా?" ఉత్సుకతగా అడిగాను.

"నేను ఈ ఊరి మనిషిని కాను. మాది బంగ్లాదేశ్. ఇపుడు నేను ముంబై నుండి పారిపోయి వచ్చాను." నిర్లిప్తంగా అందామె.

పారిపోయి రావడం ఏమిటి? ఈమెగాని దొంగా ఏమిటి కొంపతీసి. అయితే అయింది లే, అందమైన దొంగ అనుకున్నాను మనసులో.

నా చూపులకు సమాధానంగా...."నేను ఒక కాల్ గర్ల్ ను. నన్ను నా మామగారు ముంబైలో అమ్మేశాడు. మూడేళ్ళ నుండి ఎన్నో ప్రదేశాలు తిప్పారు. ఇపుడు దేశం దాటించే ప్రయత్నం చేస్తున్నారు. దేశం దాటితే ఇక మళ్ళీ ఇక్కడికి వచ్చేది ఉండదు. అక్కడ చనిపోవడమే! నా భర్తను కలుసుకునే అవకాశం ఉండదు. నేను అతనికోసమే బ్రతుకుతున్నాను. అందుకే పారిపోయి వచ్చేసాను. ఉద్విగ్నంగా మాట్లాడుతోంది ఆమె. చెప్పుకోవడానికి ఎవరో ఒకరు కావాలి ఆమెకిపుడు.

ఇది కొంచెం షాక్ కలిగించే విషయమే నాకు. చక్కటి చీర కట్టు, గుండ్రటి బొట్టు, అందమైన రూపం...ఈ రూపం ఎందరి క్రింద నలిగిపోయిందో కదా!

అప్పుడు గమనించాను ఆమెను సరిగ్గా....నిండుగా చీర చెంగు కప్పుకుని మళ్ళీ మాట్లాడ్డం మొదలు పెట్టింది.

"నాలుగేళ్ల క్రితం నాకు పెళ్లయింది. చాలా పేద కుటుంబం మాది. ఎనిమిది మంది సంతానంలో ఆరుగురం అమ్మాయిలమే. మా ఆయన నన్ను ఒక పెళ్లిలో చూసాడంట. మా ఇంటి చుట్టూ తిరిగి నన్ను పెళ్ళికి ఒప్పించాడు. వాళ్ళదీ చాలా పేద కుటుంబమే...కానీ అఫ్సర్ కష్టపడే తత్వం కలవాడని, అమ్మ ఏమీ ఆలోచించకుండా పెళ్లి చేసేసింది. నిజంగానే అఫ్సర్ చాలా మంచోడు. నన్ను ప్రాణంగా చూసుకునేవాడు. మా పెళ్ళయిన ఆరు నెలలకు అతనికి ఆక్సిడెంట్ అయింది. దెబ్బలు బయటికి పెద్దగా లేవు. వారం రోజుల్లో తగ్గిపోయాయి. కానీ అప్పటి నుండి రోజూ తలపోటు అనేవాడు. పనికి వెళ్ళలేకపోయేవాడు. అతనిదీ పెద్ద సంసారమే. నలుగురు తమ్ముళ్ళు చిన్నోళ్ళు, మా అత్తామామలు, మా మామగారి అమ్మ. ఇందరిని అఫ్సర్ ఒక్కడే పోషించాలి. ఇంట్లో రోజూ పస్తులు ఉండే పరిస్థితి వచ్చేసింది.

ఒకరోజు ఆసుపత్రికి వెళ్లి వచ్చాడు. ఏం చెప్పాడో తెలియదు, మా అత్తమామలు ఏడుపు మొదలు పెట్టారు. నా పై ప్రాణం పైనే పోయింది. అఫ్సర్ కు మెదడులో రక్తం గడ్డ కట్టిందంట. ఆపరేషను చెయ్యాలంట. మనిషి బ్రతకాలంటే రెండు లక్షలు కావాలంట. రెండు వందలకే దిక్కు లేని మాకు రెండు లక్షలెక్కడివి? ఆ రాత్రి అఫ్సర్, నేను నిద్రపోలేదు. నీతో ఒక్క రోజు బ్రతికినా చాలనుకున్నాను హసీనా, ఆరు నెలలు బ్రతికాను. చాలు, ఇక చచ్చిపోతాను. అంటూ నన్ను కౌగలించుకుని భోరున ఏడ్చాడు. అంత ప్రేమను ఎలా పోగొట్టుకునేది? ఏం చేసి అతన్ని బ్రతికించుకోవాలి? నాకు మతి పని చెయ్యలేదు. ఆ రోజు నుండి అతని ప్రేమ ఇంకా

పెరిగిపోయింది. నడవలేకపోయినా మసీదుకు వెళ్ళేవాడు. వస్తూ నాకు పువ్వులు పట్టుకొచ్చేవాడు. ఇంట్లో వాళ్ళకు తెలియకుండా ఒక్కోరోజు బస్తాలు మోసి, నాకు జిలేబీ తెచ్చి, చాటుగా తినమనేవాడు. ఒక్క నిముషం కుడా నన్ను వదిలి ఉండేవాడు కాదు.

"నేను చనిపోయేవరకూ నిన్ను ప్రేమిస్తూనే ఉంటాను, నేను చనిపోయాక బ్రతుకు నాశనం చేసుకోకు, మళ్ళీ పెళ్లి చేసుకో అని అతను అంటూ ఉంటే నేను ఏడుస్తూ కూర్చునేదాన్ని. ఎలా అయినా నా భర్తను బ్రతికించుకోవాలి. ఇదే ఆలోచన రోజూ...కానీ ఎలా అనేది తెలిసేది కాదు.

ఒకరోజు రహ్మతుల్లా వచ్చాడు మా ఇంటికి. వేరే దేశాల్లో ఇళ్ళల్లో పనులకు తీసుకువెళ్తూ ఉంటాడు మా దేశం వాళ్ళను. మీ ఇంట్లో ఎవరైనా పనికి వెళ్తాం అంటే తీసుకుపోతాను అన్నాడు. మా అత్తకు నీరసం, మామగారిని ఎవరు తీసుకెళతారు?

"ఎంతిస్తారు?" ఆశగా అడిగాను నేను.

"ఎంత కావాలేంటి?" ఏడిపిస్తూ అడిగాడు రహ్మతుల్లా.

"మా ఆయనకి ఆపరేషనుకు సరిపడా కావాలి. నేను పనికి పోతాను." అన్నాను.



"ఇళ్ళల్లో పనికి రెండు లక్షలు ఇచ్చేస్తారా? ఒక పని చెయ్యి. మూడేళ్ళు వాళ్ళ దగ్గరే ఉండి పని చేస్తాను అని రాసి ఇస్తే అంత డబ్బు ఇవ్వొచ్చు. నేను మాట్లాడుతాను. ఏమంటావ్?" అన్నాడు.

మూడేళ్ళు అఫ్సర్ ని చూడకుండా ఉండాలి. పర్లేదు. నా భర్త బ్రతుకుతాడు కదా....

సరేనన్నాను.

అఫ్సర్ అస్సలు ఒప్పుకోలేదు. నువ్వు వెళ్తే ఇంక నేనెందుకు? నువ్వు బ్రతికించిన ఆ బ్రతుకెందుకు? నాకొద్దు. నీతో నాలుగు రోజులు సరదాగా గడిపి చచ్చిపోతా అంటూ ఏడ్చాడు.

నేను అతన్ని సముదాయించాను. మూడేళ్ళే కదా, కళ్ళు మూసుకుంటే గడిచిపోతాయని, నేను తిరిగొచ్చాక ఇద్దరం సుఖంగా బ్రతకొచ్చని చెప్పి ఒప్పించాను.

రహ్మతుల్లా నా ప్రయాణానికి కావాల్సినవన్నీ సమకూర్చాడు. ఆ రోజు అఫ్సర్ రాలేదు. అస్సలు వంట్లో బాలేదు. నా మామగారు వచ్చాడు. నన్ను రహ్మతుల్లాతో సాగనంపి వెళ్ళిపోయాడు.

భారతదేశంలో దిగాక అది ముంబై నగరం అని చెప్పాడు రహ్మతుల్లా. పెద్ద పెద్ద భవనాలు, వెడల్పాటి రోడ్లు.... ఒక పెద్ద భవనం లోకి తీసుకెళ్ళాడు. అక్కడ పని చెయ్యాలని చెప్పాడు. అక్కడ ఒక నడివయసు స్త్రీ ఉంది. ఆ భవనం అంతా చిన్న చిన్న గదులు. ప్రతి గదిలోనూ ఎవరో ఉన్నారు. హాల్లోకి కూడా సెంటు వాసన గుప్పుమంటోంది. "ఏ లడ్కి మస్తు హై...మెయి లేకే జవూ?" వెనకనుండి ఒక మనిషి నన్ను అదాటున వాటేసుకుని ఆ నడివయసు స్త్రీని అడిగాడు.

నేను కెవ్వున కేకేసి దూరంగా జరిగాను.

అప్పటికే రహ్మతుల్లా నవ్వుతున్నాడు. నాకు అర్థమైపోయింది నన్నెక్కడికి తీసుకొచ్చారో. సివంగిలా రహ్మతుల్లా మీద పడ్డాను. అతని గొంతు పట్టుకుని "కమీనే, ఏమనుకుని ఇలాంటి ప్రదేశానికి తీసుకొచ్చావ్ నన్ను? మర్యాదగా ఇంటికి దిగబెట్టు." అన్నాను.

"హసీనా, మీ మామ నిన్ను ఇందుకే అమ్మాడు. ఇళ్ళల పనికి నీకు రెండు లక్షలు ఎవరిస్తారే? ఇందుకైతేనే ఇస్తారు. మీ ఆయన ఆపరేషను చెయ్యాలంటే ఆ డబ్బు కావొద్దా మరి? నీ ఇష్టం, తీస్కపోమ్మంటే, తీస్కపోత...కానీ నేను నీ ప్రయాణం నిమిత్తం ఖర్చు పెట్టిన ఇంకో లక్షతో సుద్దా మీరు నాకు మూడు లక్షలు ఇవ్వాలే" అన్నాడు.

నా నవనాడులూ క్రుంగిపోయాయి. ఎంత ఆలోచించినా, నా మనసు ఒప్పుకోవడం లేదు. అఫ్సర్ ముట్టుకున్న ఈ శరీరాన్ని కుక్కలు ముట్టుకోవడమా? శరీరం అంతా జలదరించింది. ఆ రాత్రి ఒక చిన్న గదిలో ఉంచారు నన్ను. నిద్రపట్టడం లేదు. ఇంతలో తలుపు తోసుకుని నా వయసే ఉన్న ఒకమ్మాయి వచ్చింది.

"నేను కూడా నీలాగే వచ్చాను. మా నాన్న చావుబ్రతుకుల్లో ఉంటే, బ్రతికించడం కోసం నన్ను నేను అమ్ముకున్నాను. కొన్నాళ్ళు చాలా బాధగా ఉండేది. కానీ నేను పంపుతున్న డబ్బులతో నా కుటుంబం రెండు పూటలా తింటోంది, మా నాన్న బ్రతికాడు. ఇంకో సంవత్సరంలో మా ఇంటికి వంపేస్తానంది మౌని. నువ్వు కూడా అలాగే వెళ్ళిపోదువుగాని....అంటూ ఆ రాత్రంతా నాకు ధైర్యం చెప్తూ ఉండిపోయింది.

నిజమే కదా....

మూడేళ్ళు.... కళ్ళు మూసుకుంటే, నేను అఫ్సర్ దగ్గరికి వెళ్లిపోవచ్చు. అలా అనుకుని ఒప్పుకున్నాను.

కానీ అదెంత కష్టమో తెలుసా? రకరకాల మనుషులు వస్తారు మా దగ్గరికి. ఒకడు తాగి వస్తాడు, ఒకడు మనకి

తాగిస్తాడు. వాళ్ళు మా శరీరాలతో చేసే గలీజు పనులకు అసహ్యం పుడుతుంది. ఆ అసహ్యాన్ని మర్చిపోవడానికి మాకు కూడా తాగడం అలవాటు అవుతుంది. నాకు డబ్బేమి ఇచ్చేది కాదు మౌసి. "నీ డబ్బంతా ముందే నీ భర్త ఆపరేషనుకు ఇచ్చేసాం. నీకేమి డబ్బులు రావు మూడేళ్ళ దాక." అనేది. విటులలో కొందరు దయామయులు ఉంటారు. వాళ్ళు మౌసికి తెలియకుండా డబ్బులిచ్చేవారు. అవి కూడా మౌసికి తెలియకుండా బంగ్లాదేశ్ పంపించేదాన్ని. కొన్నాళ్ళకి మౌసి దగ్గర మంచి పేరు సంపాదించాను. నాకు గిరాకీ కూడా ఎక్కువే. అందుకే ఒక రోజు ఆమె నా అభ్యర్థనను మన్నించింది.

మా ఆయనకు ఉత్తరాలు రాసుకునే అవకాశం ఇచ్చింది.

నేను చిన్న చిన్న ఉత్తరాలే రాసేదాన్ని. మా ఆయన ఎంత బాగా ఉత్తరం రాస్తాడో తెలుసా? మనసంతా గుప్పెట్లో పట్టి, వేళ్ళలోకి పంపి రాస్తాడు. ఆపరేషను అయ్యింది అతనికి. కానీ ఇంకో రెండేళ్ళు పనికి పోకూడదు అన్నారంట డాక్టర్లు. నన్ను ఖంగారు పడొద్దు అంటాడు. నీ కోసం కళ్ళు కాయలు కాసేలా ఎదురు చూస్తున్నాను అంటాడు. "శరీరం చెడిపోయినా, నా మనసంతా అఫ్సర్ ఉండడం వల్ల బ్రతికేస్తున్నాను. పోయిన నెలతో నా మూడేళ్ళ చెర పూర్తయింది. నేను మా దేశం వెళ్ళిపోతానన్నాను. సరేనంది మౌసి. మొన్నొక విటుడి ఇంటికి పంపింది. నిజానికి చాలా జాగ్రత్తలు తీసుకుంటుంది ఈ విషయంలో. కానీ ఈ సారి నన్ను స్వేచ్ఛగా వదిలేసింది. వెళ్ళిపోతున్నాను కదా...' 'ఆ విటుడు పెద్ద వ్యాపారవేత్త. భార్య చనిపోయింది. అప్పుడప్పుడూ నా దగ్గరకే వచ్చేవాడు. ఇపుడు వంట్లో బాలేదని నన్ను పిలిపించుకున్నాడు. నేను బయలుదేరేముందు నాకు ఈ మొబైల్ బహుమతి గా ఇచ్చాడు. వెళ్ళిపోతున్నావంట కదా....ఇది నా గుర్తు గా ఉంచుకో అన్నాడు. నాకు చాలా సంతోషం అనిపించింది. చాలా ఖరీదైన ఫోనది. నన్ను మా ఏరియా లో దిగబెడుతూ అతని కారు డ్రైవరు, " దుబాయి లో అంతా షేకులేనే పిల్లా...నీ పంట పండింది పో!" అన్నాడు.



"నేను వెళ్ళేది బంగ్లాదేశ్....దుబాయి కాదు."అనబోయి ఆగిపోయాను నేను. ఎందుకో మనసు కీడు శంకిస్తోంది. అప్పటికి ఆ ఆలోచనను ప్రక్కకి తప్పించాను. మొబైల్ ను జాకెట్టు లో పెట్టేసుకుని ఇంట్లోకి వెళ్ళిపోయాను. మర్నాడు ఇంకో శేట్ దగ్గరికి పంపింది మౌసీ. ఇది రెండు రోజుల కోసం. నాకు అనుమానం వచ్చింది. మొదటి రోజు రాత్రి పని అయ్యాక నాకు వంట్లో బాలేదని చెప్పాను శేట్ కి. లక్ష రూపాయలు ఇచ్చాను రెండు రోజులకి. రేపు కోల్కతా నుండి నా స్నేహితులు కూడా వస్తున్నారు, నువ్వు వెళ్ళిపోతే ఎలా? అంటూ సణిగాడు శేట్. నాకు నెలసరి వచ్చిందని చెప్పాను. తిట్టుకుంటూనే ఆ మర్నాడు ఉదయం డ్రైవరును ఇచ్చి పంపాడు. డ్రైవరును వీధి చివరే ఆపెయ్యమని చెప్పి దిగిపోయాను. వెనుక వీధి లోనుండి మాకు ఒక తలుపు ఉంటుంది. పోలీసులు వచ్చినపుడు విటులను పంపెయ్యడానికి. ఆ తలుపు గుండా ఇంటిలోకి వెళ్ళి, మౌసీ గది వెనక వైపు కిటికీ దగ్గర నిలబడ్డాను. నా అనుమానం నిజమయ్యింది. మౌసీ గదిలోనుండి రహ్మతుల్లా గొంతు వినిపిస్తోంది. కర్ణకఠోరమైన గొంతు. నా జీవితాన్ని చేదుగా నులిమేసిన గొంతు. ఎలా మరచిపోగలను. "దాని వీసా జాగ్రత్తగా దాచావా? దాని ఫోటోలు చూసి షేకు తెగ ఇదయ్యిపోయాడనుకో! నువ్వు నాకు ఇంకో రెండు లక్షలైనా ఎక్కువ ఇవ్వాలి రూపా....దాన్ని నేను మూడేళ్ళ క్రితం తీసుకొచ్చినపుడు బక్కగా, పీలగా ఉండేది. ఇపుడు చూడు, వయసు పెరిగే కొద్దీ కండ పట్టి భలే తయారయ్యింది. నీకు ఇపుడు వచ్చే డబ్బు నువ్వు ఎపుడూ ఎవర్ని అమ్మినా వచ్చి ఉండదు." నిష్ఠూరంగా అంటున్నాడు.

"పోరా బేవకూఫ్...నా దగ్గర ఉండడం వల్లే అది అంత అందంగా తయారయ్యింది. నువ్వే నాకు నీకొచ్చే సొమ్ములో సగం ఇచ్చెయ్యాలి." గట్టిగా నవ్వుతూ అంది మౌసీ.

''పాపం అది బంగ్లాదేశ్ వెళ్ళిపోతున్నాను అనుకుంటుంది. దుబాయి అని తెలిస్తే పారిపోదూ?'

'ఇంకా వాళ్ళు ఏదేదో మాట్లాడుతున్నారు. కానీ నాకు మెదడు పనిచెయ్యడం మానేసింది. చప్పుడు చెయ్యకుండా నా గదిలోకి జొరబడ్డాను. అప్పుడప్పుడూ విటులు ఇచ్చిన డబ్బులు తలుపు పైన ఉన్న సందులో పెట్టాను. అవి తీసుకున్నాను, కొన్ని బట్టలు సంచిలో పెట్టుకున్నాను, మొన్న శేట్ ఇచ్చిన మొబైల్ తీసుకున్నాను. అంతే, తిరిగి చూడకుండా వెనుక తలుపులోంచి బయటపడి పరుగు తీశాను.

ఎక్కడికి వెళ్ళాలి? ఎవరి దగ్గరికి వెళ్ళాలి? కొందరు విటులు మంచి వాళ్ళు ఉన్నారు. కానీ వాళ్ళను నమ్మగలనా?

అప్పుడు గుర్తొచ్చింది నూర్జహాన్. ఆమె ఒక స్వచ్ఛంద సంస్థలో ఉద్యోగి. మా వ్యభిచార గృహాలకు ఈ స్వచ్ఛంద సంస్థ వాళ్ళు వస్తూ ఉంటారు. మా ఆరోగ్యం గురించి, వ్యక్తిగత శుభ్రత గురించి, కాండోమ్" ల వాడకం గురించి చెప్తూ ఉంటారు. "నూర్జహాన్ చాలా సౌమ్యురాలు. నా కథ విని

చాలా చలించింది. నేను భర్త కోసం చేసిన త్యాగాన్ని ఎప్పుడూ పొగుడుతూ ఉండేది. నేను త్వరగా నా భర్తను చేరుకోవాలని అల్లాహ్ ను కోరుకునేది. ఆమె ఫోన్ నంబరు తెలీదు. ఇల్లు గుర్తుపట్టడం చాలా సులువు అని చెప్పేది. ఆమె చెప్పింది గుర్తు చేసుకుని అంధేరీ చేరుకున్నాను. అక్కడి మసీదుకి రెండో లైనులోనే ఉంది ఆమె ఇల్లు.'

"నన్ను చూడగానే ఆమె స్నేహితురాలు అనుకున్నట్టుంది ఆమె తల్లి. నన్ను కూర్చోబెట్టి, కాఫీ ఇచ్చింది. ఆమె చెప్పిన మాట నాకు చాలా తియ్యగా అనిపించింది. నూర్జహాన్ సంస్థ పని మీద బంగ్లాదేశ్ వెళ్లిందంట. నేనే నా దేశం వెళ్ళిపోయినంత సంతోషం అనిపించింది. నేనెవరో చెప్పలేదు. అక్కడి ఫోన్ నంబరు కావాలని అడిగాను. అక్కడి ఆఫీసు నంబరు ఇచ్చిందంటూ ఒక నంబరు తీసుకొచ్చింది ఆమె. నేను ఆశగా అక్కడే ఉన్న లాండ్ లైన్ ఫోనును చూస్తుంటే, ఆమె ఆ నంబరు కలిపి, ఆఫీసు వాళ్ళను నూర్జహాన్ ను పిలవమని చెప్పింది.'



'ఐదు నిముషాల తర్వాత నేను ఆమె తో మాట్లాడాను. నాకు కన్నీళ్లు ఆగడం లేదు. నేను చెప్పేది నూర్జహాన్ కు అర్థం అయింది. కానీ ఆమె భయపడింది. ఆమె నాతో స్నేహంగా ఉంటుందని మా గృహం లో అందరికీ తెలుసు. ప్రాణభయం అన్ని భయాలకన్నా గొప్పది. ఆమె పని చేసే స్వచ్ఛంద సంస్థ ద్వారా సహాయం చెయ్యమని అడిగాను. ఆమె ఎవరితోనో మాట్లాడింది. చివరికి నన్ను అస్సాం బోర్డర్ కు తీసుకురావాల్సింది గా ఆమె సహోద్యోగిని కోరింది. అతను నన్ను ఇక్కడి వరకూ తీసుకొచ్చాడు. కానీ అతని భార్యకు సీరియస్ గా ఉందని ఫోన్ రావడంతో నన్ను ఇక్కడ ఒక హోటల్లో వదిలి అతను వెళ్ళిపోయాడు. నూర్జహాన్ ఫోను కలవడం లేదు. ఆమెను ఈ లోపు నా భర్తను కలిసి విషయం చెప్పి, పోలీసులకు తెలియజెయ్యమని చెప్పాను. ఆమె ఇంకా ఫోను చెయ్యలేదు. ఇంటికి చేరబోతున్నాను కదా, ఒక చీర అయినా మంచిది కొనుక్కుందామని టౌనులోకి వచ్చాను. ఈలోగా మావోల అల్లర్లు మొదలయ్యాయి. ఎటు పరుగుతియ్యాలో తెలియక ఇలా మీ లాగే అడవిలోకి పరుగెత్తి వచ్చేసాను.'

ఈ వ్యభిచార గృహాల కథలు నాకు క్రొత్త కాదు. ఎందుకంటే, నా ఆస్తిలో ముప్పావు భాగం కరిగిపోవడానికి ఈ కొంపలే కారణం. "ఏయ్! నాకు ముక్కుపుడక కొనుక్కురావా?" అని మొదలు పెట్టి, నెక్లేసుల వరకూ వెళ్తారు వీళ్ళు. డబ్బులిస్తే వీళ్ళ ఓనరు తీసేసుకుంటుంది. అందుకే మొబైల్ ఫోనులు, బంగారు నగలు, తినుబండారాలు అడుగుతారు. వీళ్ళ దీన గాథలు విని ఉన్నాను. వాళ్ళకు అప్పటికప్పుడు ఏవో జాలి పడుతున్నట్లు కబుర్లు చెప్పి, పని కానిచ్చుకుని వచ్చేయ్యడమే! వీళ్ళ కష్టాలు తీర్చడానికి ప్రయత్నిస్తే ప్రాణాలే పోతాయి. కానీ ఈమె కథ కొంచెం వేరు.

ఆమె భర్త ఆమె కోసం కళ్ళు కాయలు చేసుకుని ఎదురుచూస్తున్నాడు. మూడేళ్ళ కాలాన్ని ఇద్దరూ మూడు యుగాలు గా గడిపారు పాపం. ఇప్పుడైనా ఇద్దరూ కలిస్తే బావుంటుంది.

"నన్ను కాస్త ఈ అడవి అవతల ఉన్న బాంగ్లాదేశ్ బోర్డర్ లో దిగాబెడతారా? అక్కడి నుండి మా దేశానికి దారి ఉందంట. నేను ఎలాగోలా వెళ్ళిపోతాను." ఆశగా అడుగుతున్న ఆమె దీనత్వం కన్నా, ఆమె అందమే కనపడుతోంది నాకు. ఎలాగూ కొన్ని రోజుల్లో ఆమె తన భర్తను కలుస్తుంది. అతను ఆమెను స్వీకరిస్తాడు. ఈ చివరిసారి ఆమె నాతో ఒక్కసారి ఉంటే ఏం పోతుంది?

"నేను దిగాబెడతాను, నువ్వు ఖంగారు పడకు.' 'ఆమె భుజం చుట్టూ చెయ్యి వేసాను. ఆమెకు అర్థం అయింది. ఆమెకు చిరపరిచితం అయిన దేహ భాష ఇది. మనసు చివుక్కుమన్నట్టు చూసింది నా వైపు. కానీ అవసరం ఆమెది. ఇపుడు ఆమెకు నేను తప్ప దిక్కు లేదు.

ఆ నల్లటి బండరాయి కరుకుదనం నా మనసు కరుకుదనం కన్నా నయమనుకుందేమో, తన శరీరాన్ని ఆ బండరాయి పై పరిచింది. వెన్నెల జల్లు రాతిపై పడుకున్న వెన్నెల పై కురుస్తూనే ఉంది. చితికి, రక్తం చిందుతున్న ఆ పెదాలను పళ్ళతో నొక్కిపట్టింది. రమించిన నా శరీరం అలసి ఆమె ప్రక్కన జారబడింది.

దుస్తులు తొడుక్కుంటూనే పది సార్లు మొబైల్ చెక్ చేస్తూ ఉంది ఆమె.

"నీ పేరేమిటి?" ఇంత అందమైన అనుభవాన్ని ఇచ్చిన ఆమె పేరు తెలుసుకోకపోవడం అన్యాయం కదూ మరి!

"హసీనా'

'నువ్వు నిజంగానే హసీనావి' అన్న నా మాటకు పేలవంగా నవ్వింది. పవిట వేసుకుంటుండగా మ్రోగింది ఆమె ఫోన్. మాట్లాడుతుంటే ఆమె కళ్ళు పెద్దవి అవుతున్నాయి.

"ఆ వీధి లో చివరి నుండి మూడో ఇల్లు. నువ్వేది చూసావో!'

# మహా మర్రి

నాంపల్లి సుజాత
9848059893



ఏడెనిమిది దశాబ్దాల నుంచి
ఎందరికి గొడుగు పట్టిందో తల్లి
ఎండావానా భయపడేవి
దీని నీడను చూసి
పాదచారుల కోసం
కళింగుడు నాటించినట్లుండేది
మా పోతారం పొలిమేరల
పహారా కాసే జవానులా
తాతల నుంచి పానాదుల్లో పాదచారులే
ఎన్ని మైళ్ళయినా ఈ రెండు చక్రాలే ఆధారం
ఇప్పుడంతాధునిక రవాణే
నరమానవుడు నడుస్తున్న పాపాన పోడు
పోరుగూరి బడి పుస్తకాలభారం
అలసిన మా దేహాలను
ఊడల ఉయ్యాలూగించేది
వివాహ ఊరేగింపులు విజయోత్సవర్యాలీలు
ఆశీర్వదించి పంపే పెద్దమ్మ ఇది
ఊరు ఊరంత క్యాదారిగౌరమ్మనోములు
మర్రాడలూ మర్రిపండ్లదే మహత్యమంతా!
బస్సెడు మందికి టిక్కెట్లంటే మాటలా
దీని కిందే కాస్తా ఉపశమనం కండక్టరమ్మకు
ఏగిలివారంగా వాకింగులు వ్యాయామాలు
తాజాప్రాణవాయువిచ్చే నెచ్చెలిది
సుక్కరారం అంగడి మందికి
అలాయిబలాయిచ్చే పెద్దన్నిది
కొత్తకొండ జాతర ఎల్లమ్మతీర్థం
బండిడిశి బువ్వందుకునేదిక్కన్నే
పంచాయితీలు పంచనామాల
హుష్‌కాకీ దీని గాలిసోకి
పొట్టచేతబట్టిన సంచారడేరాలు
దీని బళ్ళోనే వెలిసేవి
నిన్నా మొన్నటి వంటావార్పుకు
మసాలా దట్టించిదీ వృక్షరాజమే
పిట్టగూళ్లు తేనె తెట్టెలు
కోతి కొండెంగలూ శాపం పెడ్తున్నయి
ఇప్పుడా జాగాను చూస్తే
బోరున ఏడువాలనిపిస్తుంది
పచ్చగా బతుకునిచ్చిన మర్రిని
నిలువునా కూల్చిందెవరో
రోడ్డు వైడింగనోసాకు
దూరానున్న చెట్టును నరికి
జేబులేసుకున్నరు
దయ్యాల మర్రని పేరే గాని
దయగల తల్లి మహా మర్రి

(హుస్నాబాద్ పోతారం మధ్యనున్న మర్రిచెట్టును నిలువునా కూల్చేసిన సందర్భంగా బాధతో....)

---

'ఆ...అతనే....పొడవుగా, తెల్లగా, కుడి కనుబొమ్మ మీద పెద్ద పులిపిరికాయ ఉంటుంది.' 'అవును. కాదు. నిజంగా అదే ఇల్లా? పిల్లోడా? భార్యా?'

'మా అత్త చనిపోయిందా? మామ బ్రతికే ఉన్నాడా?"అఫ్సర్ ఏమన్నాడు?' 'నేను పారిపోయానా? అమ్మా, నాన్నా ఛీ అన్నారా?' 'అటునుండి నూర్జహాన్ ఏం మాట్లాడుతుందో తెలీదు. కొంతసేపటికి ఫోన్ కట్ అయింది. బండరాయి ఫెళ్ళున బ్రద్దలైనట్లు హసీనా ఒక్కసారే బ్రద్దలయింది. తన చావును తానే చూసినట్లు హతాశురాలై వెక్కి వెక్కి ఏడుస్తోంది. రెండు చేతులతో మేము పడుకున్న బండరాయిని కొడుతోంది, మళ్ళీ తన శరీరాన్ని కొట్టుకుంటోంది.

నాకు అర్థం అయింది. మోసాలు ఎన్నో చూసాను నేను. నేను చేసినవీ మోసాలే....నా స్వార్థానికి ఎంతో మందిని వాడుకున్నాను. కానీ ఇంతోటి మోసం!! మోసమంటేనే మోసం....అందులో చిన్న, పెద్ద ఏముంది? ఆమె ఎటువంటి సంఘర్షణకు లోనవుతుందో అర్థం అవుతుంది. పిచ్చిగా, వెర్రిగా ఆ రాత్రంతా ఏదేదో మాట్లాడుతూనే ఉంది. ఏడుస్తూనే ఉంది. తలను బండరాయికేసి బాదుకుంటూనే ఉంది.

నేను ఆమెను దగ్గరికి పొదువుకున్నాను. చిత్రంగా నా కళ్ళల్లోనూ నీళ్ళే! రాత్రి కరిగిపోయింది ఆమె కన్నీట్లో మరిగి వెన్నెల వెలిసిపోయింది. ఆమె దుఃఖంలో పగిలి ఉదయం ఏం మోసుకొచ్చిందో తెలీదు....అస్సాంలోని బంగ్లాదేశ్ ఎంబసీకి ఆమె వదలిన దేహాన్ని తీసుకుపోయాను నేను!

ఆమె చరిత్ర ఇపుడు ఏ సిరాతో రాయబడుతుందో!!!



ఆధునిక గ్రంథాలయోద్యమ సారథి

# వెలగా వెంకటప్పయ్య



డా॥ తన్నీరు కళ్యాణ్ కుమార్
9490776385

తెలుగునాట ఉద్యమస్థాయిలో ప్రజా గ్రంథాలయాలను ఏర్పాటుకు కృషి చేసిన మహానుభావుడు డాక్టర్ వెలగా వెంకటప్పయ్య. ఐదు దశాబ్దాలకు పైగా గ్రంథాలయోద్యమానికి ఆయన తన జీవితాన్ని అంకితం చేశారు. అయ్యంకి వెంకట రమణయ్య, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, పాతూరినాగభూషణం, వావిలాల గోపాలకృష్ణయ్య వంటి గ్రంథాలయోద్యమకారుల వారసునిగా ఉద్యమానికి కొత్త బాటలు వేశారు. నమూనా పౌర గ్రంథాలయ చట్టాన్ని రూపొందించడమే కాకుండా, గ్రంథాలయాలకు సంబంధించిన గ్రంథసూచీలు, అనుక్రమణికల తయారీ, పుస్తక ప్రచురణ తదితర అంశాలలో అపారమైన కృషి చేశారు. బాల సాహిత్యంలో విశేష కృషి చేశారు. వయోజన విద్య, సంపూర్ణ అక్షరాస్యత ఉద్యమాలలో చురుకుగా పాల్గొన్నారు.

వెంకటప్పయ్య గుంటూరు జిల్లా తెనాలి ఐతానగర్ లో 1932 సంవత్సరంలో సాధారణ రైతు కుటుంబంలో జన్మించారు. శాఖా గ్రంథాలయంలో సాధారణ ఉద్యోగిగా జీవితం ప్రారంభించి, అవే గ్రంథాలయాలకు మార్గదర్శిగా నిలిచారు. గ్రంథాల సేకరణ, భద్రతలను గూర్చి, గ్రంథాలయాల అభివృద్ధి గురించి తపిస్తూ, తెలుగు గ్రంథాలయా బోధనా శాస్త్ర పితామహునిగా, గ్రంథాలయాల శాస్త్రవేత్తగా ఆయన చిరస్మరణీయుడయ్యారు. తెలుగు సాహిత్యంలో యం.ఏ. చేసిన ఆయన ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచి లైబ్రరీ సైన్స్ లో డిప్లొమా పొందారు. బాల సాహిత్యం పై పరిశోధన చేసి డాక్టర్ రేట్ డిగ్రీని పొందారు. లైబ్రరీ సైన్స్ పాఠశాలకు మొదటి ప్రిన్సిపాల్ గా వ్యవహరించి, తరగతుల సిలబస్ ను రూపొందించారు. గ్రామీణ గ్రంథాలయాలను స్థాపించి, ప్రజలకు గ్రంథాలను సన్నిహితం చేశారు. రాష్ట్రంలోని అన్ని విశ్వవిద్యాలయాలలో గ్రంథాలయ కోర్సు అభ్యసించే డిగ్రీ, పిజీ విద్యార్థులకు పాఠ్యాంశాలను రూపొందించారు.

గ్రంథాలయ విజ్ఞానములో వెంకటప్పయ్య స్పృశించని అంశం లేదంటే అతిశయోక్తి కాదు. గ్రంథాలయశాస్త్రంలో 80 కి పైగా రచనలు చేశారు. మరో 300 వ్యాసాలను రాశారు. గ్రంథాలయ చట్టాల నిర్మాణం, అమలుపై తాను ప్రతిపాదించిన విషయాలతో, మోడల్ పబ్లిక్ లైబ్రరీ అండ్ ఇన్ ఫర్మేషన్ సర్వీసెస్ యాక్టును దేశమంతటికీ వర్తించేలా ఆమోదింపజేశారు. వాషింగ్టన్ లోని ప్రపంచ ప్రసిద్ధ గ్రంథాలయంలో లైబ్రరీ సైన్స్ పై ఆయన వ్రాసిన పుస్తకాలు ఉంచడం ఆయన ప్రతిభకు నిదర్శనం. గ్రంథాలయ ప్రగతికి చేయూతనందించే దిశలో భాగంగా పౌర గ్రంథాలయ చట్ట రూపకల్పన పై రాజా రామ్మోహనరాయ్ లైబ్రరీ ఫౌండేషన్ సహకారంతో ఢిల్లీ, లక్నో, చెన్నైలలో సదస్సులు నిర్వహించారు. ఆయన సంపాదకత్వంలో వెలువడిన మార్చ్ ఆఫ్ లైబ్రరీ సైన్స్ (1979) అనే గ్రంథం అమెరికా, కెనడా, బ్రిటన్, నెదర్లాండ్స్, జపాన్, సౌదీ అరేబియా, చైనా, తైవాన్, దక్షిణాఫ్రికా, సింగపూర్ వంటి దేశాలలోని 73 ప్రసిద్ధ గ్రంథాలయాలలో లభిస్తుంది. ఆధునిక పద్ధతుల్లో గ్రంథాలను భద్రపరచడం, గ్రంథాలయాలను - గ్రంథాలను డిజిటలైజ్ చేసి ఇంటర్నెట్ లో అందుబాటులోకి తీసుకొనిరావడం లాంటి కార్యక్రమాల అమలుకు ఆయన చేసిన కృషి శ్లాఘించదగినది.

తెలుగు పుస్తకాల అమరిక, నిర్వహణలో ఎదుర్కొంటున్న సమస్యలను తొలిగించడానికి విదేశాల్లోని గ్రంథాలయ, సమాచార శాస్త్రవేత్తల సూచనలను పరిశీలించి మన పరిస్థితులకు అనుగుణంగా వర్గీకరణ నియమాలు, గ్రంథకర్తల గుర్తులు, విషయ

శీర్షికలను వెంకటప్పయ్య రూపొందించారు. రాష్ట్ర ప్రభుత్వ పౌర గ్రంథాలయ శాఖ తెలుగు పుస్తకాల వర్గీకరణకు డ్యూయీ దశాంశ వర్గీకరణ విధానాన్ని సవరించి, నూతన జాబితాల తయారీలో ప్రముఖ పాత్ర పోషించారు. సోవియట్ రష్యా ప్రభుత్వ ఆహ్వానంపై మాస్కో పర్యటనకు వెళ్ళారు. అక్కడ గ్రంథాలయాల తీరును క్షుణ్ణంగా పరిశీలించి లెనిన్ గ్రంథాలయ విధానం, లైబ్రరీ సైంటిఫిక్ అండ్ టెక్నికల్ ఇన్ఫర్మేషన్ ఇన్ ది యుఎస్ఎస్ఆర్ గ్రంథాన్ని వెలువరించి ఆ వ్యవస్థను తెలుగు వారికి పరిచయం చేశారు. వెలగా రచించిన ఆంధ్ర వ్మాయ సంగ్రహ సూచిక, శాస్త్రీయ వ్మాయ సూచిక, గ్రంథ సూచికలు వివిధ రంగాలపై ఆయనకు గల విషయ పరిజ్ఞానానికి అద్దం పడతాయి.

వెంకటప్పయ్య తన జీవితం, తన వృత్తి, తన మనో ప్రవృత్తి గ్రంథాలయోద్యమానికి అంకితం చేశారు. తనకు ముందు తరం స్వాతంత్రోద్యమాన్ని, గ్రంథాలయోద్యమాన్ని కలిపి ప్రజా చైతన్య స్ఫూర్తి కోసం ఉద్యమించారు. గ్రంథాలయోద్యమాన్ని ఆచరణలోకి తెచ్చారు. బహుశా ఆయన పరిశీలించని, లేదా చూడని తెలుగు గ్రంథం లేదంటే అతిశయోక్తి కాదు. వాఙ్మయ సూచీకరణ కోసం గ్రంథాలయ పాఠ్య పుస్తకాల రచయితగా ఆయనకు తెలుగులో వెలువడిన ప్రతి పుస్తకం గురించిన పరిజ్ఞానం ఉండేది. రేపల్లె, తెనాలి, గుంటూరు, ఒంగోలు, కడప, మచిలీపట్టణంలో గ్రంథాలయ భవనాల నిర్మాణంలో ఆయన పోషించిన పాత్ర గొప్పది. వెంకటప్పయ్య జన్మదినాన్ని పురస్కరించుకొని గత సంవత్సరం జూన్ మాసంలో విజయనగరం జిల్లా తోటపల్లి, పార్వతీపురం తదితర గ్రామాలలో 50 గ్రామీణ గ్రంథాలయాలను ఆయనచే ప్రారంభింపజేశారు. కోదాటి నారాయణరావు రాష్ట్ర గ్రంథాలయ సంస్థ అధ్యక్షులుగా ఉన్న కాలంలో ప్రైవేటు గ్రంథాలయాలకు కూడా ప్రభుత్వ నిధులు అందేలా కృషి చేశారు. గ్రంథాలయ శాఖ ఉద్యోగుల సంక్షేమానికి కూడా వెంకటప్పయ్య చేసిన కృషి మరువలేనిది. ఉద్యోగులకు 010 పద్దు కింద వేతనాలు ఇప్పించాలని రాష్ట్ర ప్రభుత్వాన్ని పలుమార్లు కోరారు. రాష్ట్రం విడిపోయిన నేపథ్యంలో గుంటూరులో గ్రంథాలయ శాఖకు సంబంధించిన స్టేట్ లైబ్రరీని ఏర్పాటు చేయాలని అభిలషించారు.

**వెంకటప్పయ్య జన్మదినాన్ని పురస్కరించుకొని గత సంవత్సరం జూన్ మాసంలో విజయనగరం జిల్లా తోటపల్లి, పార్వతీపురం తదితర గ్రామాలలో 50 గ్రామీణ గ్రంథాలయాలను ఆయనచే ప్రారంభింపజేశారు.**

సంపాదకునిగా వెలగా వెంకటప్పయ్య ఎన్నో పుస్తకాలను తీర్చుదిద్దారు. ఎందరో రచయితలను ప్రోత్సహించారు. రచనలు, సంపాదకత్వాలు, సంకలనాలు కలిపి 50 వేల పుటలకు పైగా తెలుగు, ఆంగ్ల భాషల్లో ఆయన ప్రచురించారు. తెలుగు బాలల రచయితల సంఘం వ్యవస్థాపక కార్యదర్శిగా బాల సాహిత్యవేత్తలకు స్ఫూర్తిని కలిగించారు. బాలల కోసం సచిత్రంగా 40 గ్రంథాలను రచించడంతో పాటు 120 గ్రంథాలకు సంపాదకత్వం వహించారు. ముప్ఫై వేల తెలుగు సామెతలు, వెయ్యి తెలుగు బాలల జానపద గేయాలు, మూడు వేల పొడుపు కథలు, 15 వేల జాతీయాలను సేకరించి ప్రచురించారు. నార్ల, ఆవుల, సి.ఆర్. రెడ్డి, కొసరాజు, చక్రపాణి, న్యాపతి, అయ్యంకి వంటి మహానుభావుల సంపూర్ణ గ్రంథాలను ప్రచురించారు. వెలగా రచించిన "మన వారసత్వం" గ్రంథానికి తెలుగు విశ్వవిద్యాలయం ఉత్తమ గ్రంథంగా అవార్డు ఇచ్చింది.

గ్రంథాలయాలు, తెలుగుభాషాభివృద్ధికి తపించిన ఆయన తన సుదీర్ఘ ప్రస్థానంలో కేంద్ర సాహిత్య అకాడమీ తెలుగు సలహా మండలి సభ్యునిగా సేవలందించారు. వయోజన విద్యా రచనలకు మూడు సార్లు జాతీయస్థాయి పురస్కారాలు అందుకున్నారు. బాలసాహిత్యంలో విశేష కృషికిగాను బాలబంధు గౌరవాన్ని అందుకున్నారు. 2013లో ఉగాది పర్వదినం సందర్భంగా రాష్ట్ర ప్రభుత్వం వివిధ రంగాల ప్రముఖులకు అందజేసిన ఉగాది పురస్కారాన్ని గ్రంథాలయ రంగం నుంచి ఆయనక్కొకరికే ప్రధానం చేయడం విశేషం. గ్రంథాలయ రంగంలో ఐదు దశాబ్దాలకు పైగా ఉద్యమించిన ఆయనను ఆంధ్ర, తెలుగు విశ్వ విద్యాలయాలు, సాహిత్య అకాడమీ ప్రతిభా పురస్కారాలతో సత్కరించాయి. గ్రంథాలయ శాస్త్ర పారంగత, ఉత్తమ గ్రంథపాలక, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు, గ్రంథాలయ గాంధీ వంటి అనేక పురస్కారాలను అందుకున్నారు. ధర్మవరంలోని కళాజ్యోతి సంస్థ వెలగాపై గౌరవంతో పౌర గ్రంథాలయ సేవలోని ఉత్తమ గ్రంథ పాలకులకు 1990 నుంచి ఆయన పేరుతో పురస్కారాన్ని ప్రధానం చేస్తున్నారు. తెనాలిలోని లోని ఒక వీధికి వెలగా పేరిట నామకరణం చేశారు. మంచి గ్రంథం అనే పుస్తకాన్ని జనవరి మాసంలో ఆవిష్కరించే ప్రయత్నంలో ఉండగానే ఆయన తుది శ్వాస విడిచారు.

సాంకేతిక పరిజ్ఞానం అనేది ఎంత ఎదిగినా పుస్తకానికి మరణం లేదనీ, పుస్తకానికి ప్రత్యామ్నాయం లేదని వెంకటప్పయ్య దృఢంగా నమ్మేవారు. ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం పుస్తకాభివృద్ధికి తోడ్పడాలే గానీ, పుస్తకానికి ప్రత్యామ్నాయం కారాదనేది ఆయన సిద్ధాంతం. పనికిరాని పుస్తకాలంటూ ఉండవనీ, అచ్చయిన ప్రతి కాగితంలోనూ ఎంతో కొంత సమాచారం ఉంటుందనీ, దాన్ని గ్రహించగలగాలని ఆయన నమ్మేవారు. ఆయన ఆకాంక్షలను ఆచరణలోకి తేవడం ఒక్కటే మనం ఆయనకు ఇవ్వగలిగే నివాళి. జీవితం చివరి క్షణం వరకు పుస్తకం కొరకై పరితపించిన అక్షర తపస్వీ వెలగా వెంకటప్పయ్య. ఇలాంటి ఉద్యమకారుల కృషిని స్ఫూర్తిగా తీసుకొని యువత పుస్తకాలు చదివే అలవాటును పెంపొందించుకోవాలి. కొడిగడుతున్న గ్రంథాలయాలను పరిరక్షించుకొని, అక్షర సంపదను భద్రపర్చుకోవాలి. ఈ అక్షర విజ్ఞాన సంపదను భవిష్యత్తు తరాల వారికి వారసత్వంగా అందించేందుకు ప్రతి ఒక్కరు కృషి చేయాలి.

## చూడు ! ఆ ఆత్మస్థైర్యం !!

ఎస్. సుమిత్రాదేవి
7207550867

ఊహ తెలిసి నీ శ్వాస నిండా
విషాద తంత్రులే
దహిస్తున్న ఆకలి, ఎముకలు కొరికే చలి
నిప్పులు చెరిగే ఎండ, ముంచెత్తుతున్న వాన -
బ్రతుకు కొలిమిలో నిన్ను రాటుదేల్చాయి
చెత్త, చిత్తడి నీ శాశ్వత ఆవాసాలుగా
క్రిములు తొలుస్తున్న నీ శుష్కశరీరం
ఎంత కన్నీటిని నీగుండె మంటల్లో
ఆవిరి చేసిందో
అమ్మ పొత్తిళ్ళ వెచ్చదనం, నాన్న ప్రేమధనంలే
నిస్తేజపు ఎడారి నీ బ్రతుకు పునాది
బిలబిలమంటూ బడికి పోయే
బాల్య ప్రవాహాన్ని ఎదురీదడానికి
ఎంతటి నైరాశ్యపు బరువును మోశావో!
'నా' అన్నవారు లేని నీ ఒంటరి పయనంలో
జవాబులేని ఎన్ని ప్రశ్నల కలవరింతలో!
అప్పుడప్పుడు కొన్ని కబంధహస్తాలు
ఆప్తపు మరీచికలై నీ ఆశలతో ఆడుకుంటాయి
నిన్ను అగాధంలోకి తోసి, నీ ముద్దనుండి
రాలిపడిన ఎంగిలి మెతుకుల చలవతో



దేశదేశాలకు ఎగిరిపోతాయి
నీకు తోడుగా ఉన్న వీధికుక్కలపాటి
సంస్కారం మాకు లేనందుకు
మమ్మల్ని మన్నించు
రైలుబోగీల్లో, బస్సుషెల్టర్లలో దిక్కుతోచక
సంచరించే అభాగ్యంలో
అనుభవాలు పండిన నీ అస్తిత్వానికి
జ్ఞాన బోధచేసే సాహసం ఎవరికుంది?
సమానత్వం మంటగలిసిన జీవన స్థితిలోనూ
సుస్థిరమైన ఆత్మస్థైర్యానివి నీవు
నైరాశ్యపు తిమిరాన్ని ఛేదిస్తున్న
ఆశవు నీవు
ఓటమిని లెఖ్ఖ చేయక
జీవితాన్ని జీవించే ఆత్మవిశ్వాసం నీవు

---

## నానీలు

- తోట రామమోహన్
9603897828

విరగకాసిన
జామచెట్టు
చిలుకలు
కొమ్మకొమ్మకు అతిథులు

సూర్యుడొచ్చేసరికి
అమ్మవేసిన ముగ్గు
మరింత
మెరిసింది

ఆ పెన్సిల్ నాది
ఇచ్చెయ్యవే
నిద్దట్లో
పాప కలవరింత

స్నేహితుల వీపులే
నిచ్చెనమెట్లు
మామిడి కాయల్ని
తెంపేశా !

బావిలో ఈత నేర్పింది
ఇద్దరు గురువులు
నాన్న..
మునగబెండు

అమ్మ జోలపాటతో
నిద్ర పట్టేసింది
పాట
సగమే విన్నాను



వానాకాలం వచ్చిందంటే
మా పెరడు
పచ్చరంగు
పులుముకుంటుంది

తేనెటీగ దొంగది
పెరటిపూల తేనియను
ఎక్కడ దాస్తోందో
చెప్పదు

స్నానం చేశాక
ఫ్యాన్ కింద నుంచుంటే
గది నిండా
సుగంధ పరిమళం

బావొచ్చారు
సంచిలో మిఠాయి పొట్లం
జేబులో
మల్లెపూల పొట్లం

# కన్నడ ఆస్తి - మాస్తి



వెంకటేశ అయ్యంగారు
(1891 - 1986)

1984లో వీరి చిక్క వీర రాజేంద్ర అనే నవలకు ప్రతిష్టాకరమైన జ్ఞానపీఠ పురస్కారం లభించడం వారి ప్రతిభకు నిదర్శనం. కవిగా, కథకునిగా, నవలాకారునిగా, నాటక కర్తగా ఉత్తమ విమర్శకునిగా స్వీయ చరిత్ర, జీవిత చరిత్రల రచయితగా, మంచి వక్తగా, అనువాదకునిగా ప్రఖ్యాతి గడించిన మాస్తి తన బహుముఖ సాహితీ వ్యక్తిత్వాన్ని చాటుకున్నారు. మాస్తి 'శ్రీనివాస' అనే కలంపేరుతో ప్రసిద్ధులు.

డా. సాకిగారి చంద్రకిరణ్
8790527957

ఆధునిక కన్నడ సాహిత్యంలో తమదైన సంప్రదాయానికి నాంది పలికి కన్నడ కథాపితామహునిగా, కన్నడిగుల ఆస్తిగా కీర్తింపబడ్డ మాస్తి వెంకటేశ అయ్యంగారు కన్నడ కథాజగత్తులో ఒక నూతన ఒరవడిని సృష్టించారు. సామాజిక అసమానతలను నిర్మూలించి సకల జనుల హితాన్ని కోరే అభ్యుదయ రచయితల్లో మాస్తిని ప్రధానంగా చెప్పుకోవచ్చు. స్తబ్ధత ఉన్న ప్రాచీన జగత్తుకు, ఉత్తేజితుడైన నూతన జగత్తుకు నడుమ సేతువు కట్టడానికి యత్నించిన మహోన్నత వ్యక్తి మాస్తి. ఈయన కన్నడ సాహిత్యంలో ఎన్నో నూతన దృక్పథాలతో కథలను రాశారు. వీరు రాసిన నూరు కథలలోనూ తాత్విక సామాజిక చింతన, సంస్కరణాభిలాష కనిపిస్తాయి. 1984లో వీరి చిక్క వీర రాజేంద్ర అనే నవలకు ప్రతిష్టాకరమైన జ్ఞానపీఠ పురస్కారం లభించడం వారి ప్రతిభకు నిదర్శనం. కవిగా, కథకునిగా, నవలాకారునిగా, నాటక కర్తగా ఉత్తమ విమర్శకునిగా స్వీయ చరిత్ర, జీవిత చరిత్రల రచయితగా, మంచి వక్తగా, అనువాదకునిగా ప్రఖ్యాతి గడించిన మాస్తి తన బహుముఖ సాహితీ వ్యక్తిత్వాన్ని చాటుకున్నారు. మాస్తి 'శ్రీనివాస' అనే కలంపేరుతో ప్రసిద్ధులు.

మాస్తి కోలారు జిల్లా మాలూరు తాలూకాలోని మాస్తి అనే గ్రామంలో 1891 జూన్ 6వ తేదీన మాస్తి రామస్వామి అయ్యంగారు, తిరుమలమ్మ దంపతులకు జన్మించారు. తల్లిదండ్రులు పెట్టిన పేరు వెంకటేశ. ఈయన చిన్నతనంలోనే రామాయణ, మహాభారత కథలలోని మాధుర్యాన్ని తెలుసుకొని ఇతరులకు కథలరూపంలో చెప్పేవారు. కాకమ్మ-గువ్వమ్మ కథను తల్లినుండి విని అదే కథను తిరిగి చెప్పేవారు. ఆనాటి నుండి మాస్తి కథాజీవనం ప్రారంభమైంది. పాఠశాలలో ఉపాధ్యాయుల దగ్గర కథలను విని ఇంటిదగ్గర వాటిని వర్ణించి చెప్పేవారు. ఇది విని వారి తాతగారు భవిష్యత్తులో నీవు మంచి కథకునివవుతావని జోష్యం చెప్పేవారు. అదే మాస్తి జీవితంలో నిజమైంది.

మాస్తి మెట్రిక్యులేషన్ లో సర్వ ప్రథముడిగా ఉత్తీర్ణుడయ్యాడు. మైసూరు మహరాజా కళాశాలలోను బెంగళూరు సెంట్రల్ కళాశాలలోను ఇంటరు, బి.ఎ లు ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. మద్రాసు ప్రెసిడెన్సి కళాశాలలో ఆంగ్లసాహిత్యం అభిమాన విషయంగా స్వీకరించి ఎం.ఎ లో స్వర్ణ పథకం పొందారు. మైసూరు ప్రభుత్వంవారు నిర్వహించిన సివిల్ సర్వీసు పరీక్షలో ప్రథముడుగా ఎంపికై అసిస్టెంటు కమీషనరుగా ఆరంభించి అనేక ఉన్నత పదవులను అధిష్టించి 1943లో ఐచ్ఛికంగా పదవీ విరమణ చేశారు. సాహిత్య సేవతోపాటు అనేక ప్రజాహిత కార్యకలాపాలలో పాల్గొని మానవతా ధృక్పథంతో జీవన పత్రిక నడిపి కన్నడనాడులో మహామనీషిగా పేరుగాంచిన మాస్తి 6.6.1986 నాడు దివంగతులైనారు

మాస్తి పూర్వికులు అంత శ్రీమంతులు కారు. అందుకే వీరి బాల్యం అతి కష్టంగ గడిచింది. ఈయనలో ఉన్న విద్యాసక్తిని గమనించిన ఈయన మేనమామ వెంకటరామ అయ్యంగారు,

మిత్రుడు బల్లె రంగన్న వంటివారనేకులు మాస్తిని వెన్ను తట్టి ప్రోత్సహించారు. ఉన్నత విద్యకోసం బెంగళూరు సెంట్రల్ కాలేజీలో చేరినపుడు అక్కడి ప్రిన్సిపాల్ టేట్ సాహెబ్ మాస్తిలోని విశేష జ్ఞానాన్ని చూసి ప్రోత్సహించారు. డిగ్రీ ముగించిన తర్వాత టేట్ సాహెబ్ మాస్తిని పిలిపించి తన కళాశాలలో ఇంగ్లీషు ఉపాధ్యాయునిగా నియమించుకున్నారు. నెలకు కేవలం వంద రూపాయలతో మాస్తి తన జీవితాన్ని ప్రారంభించారు.




మాస్తి అన్ని సాహిత్య ప్రక్రియల్లోను రాసినా కన్నడ కథకుడుగానే పేరుంది. అందువల్లే ఆయన కన్నడ కథ పితామహుడన్న ప్రఖ్యాతి వచ్చింది. మాస్తి కన్నడసాహిత్య క్షేత్రంలో అడుగిడినది చిన్నకథలతోనే. 1910లో వీరు బి.ఏ. చదివేటపుడు "రంగన మధువె" అనే కథను రాశారు. మధురవాణి అనే పత్రికలో ఈ కథ ప్రకటించారు. 1920 నాటికి చిన్న కథలను రచించడంలో పరిపక్వత సాధించారు మాస్తి సరళ బాషలో తన కథలను రాసి కన్నడ ప్రజల ఆస్తిగా కీర్తిగడించారు. స్వాభావికమూ, సరళమూ అయిన విధంగా కథా కథన పద్ధతిలో ప్రజల జీవన విధానాల్నీ, మన సంస్కృతినీ వ్యక్తీకరించడంలో మాస్తికి మాస్తే సాటి. వారి కథల్లోని పరిసరాలూ, పాత్రలూ ఎంతో స్వాభావికంగా, సహజ సుందరంగానూ జీవకళ ఉట్టిపడేటట్టు ఉండడం విశేషం, ప్రభుత్వోద్యోగంలో ఉంటూనే అనేక కథా సంకలనాలు, నాటకాలు రచించారు వృత్తిలో అధికారిగా, ప్రవృత్తిలో రచయితగా జనుల మనసును అధికారుల మన్ననలను గెలుచుకున్నారు.

***ఆయన రాసిన మొత్తం కథలు నూరు. అన్ని కథలలోనూ సామాజిక జీవనం ప్రతిఫలిస్తుంది. వీరి ప్రతి కథలోనూ మధ్యతరగతి ప్రజల జీవన విధానం, సామాజిక సంఘర్షణ కనిపిస్తాయి. ముఖ్యంగా స్త్రీ పాత్రల మనస్తత్వ విశ్లేషణ మాస్తి కథలలోని విశిష్టత.***

మాస్తి ప్రభుత్వోద్యోగిగా ఉన్నప్పుడు అనేక మందిని కలిపే ఆవకాశం ఉండేది. మనిషిని చూసిన వెంటనే అతని వ్యక్తిత్వాన్ని పసిగట్టే తత్వం ఉన్న మాస్తి ప్రజలలోని మానసిక ప్రవృత్తులను ప్రతిబింబించే కథలను రాయడం అలవాటయింది. ఇంగ్లీషు ఎం ఏ చేయడం వల్ల మాస్తికి ఆంగ్లంపై మక్కువ ఎక్కువగా ఉండేది. చిన్న కథలు రాయడానికి ప్రథమ స్ఫూర్తి 'స్ట్రాండ' పత్రికలో వచ్చే చిన్న కథలను చదవడమే. మాస్తి తన చిన్న కథలను పదిహేను సంపుటాలుగా వెలువరించారు. ఆయన రాసిన మొత్తం కథలు నూరు. అన్ని కథలలోనూ సామాజిక జీవనం ప్రతిఫలిస్తుంది. వీరి ప్రతి కథలోనూ మధ్యతరగతి ప్రజల జీవన విధానం, సామాజిక సంఘర్షణ కనిపిస్తాయి. ముఖ్యంగా స్త్రీ పాత్రల మనస్తత్వ విశ్లేషణ మాస్తి కథలలోని విశిష్టత.

మాస్తి తన రచనా వ్యాసంగం మొదట ఆంగ్లంలోనే ప్రారంభించారు. ఆంగ్ల రచయిత ప్రిన్స్ రెలిక్యుస్ రచనలు చదివి జానపద గీతాలను సేకరించాలనే కోరిక కలిగింది. 1920లో చిక్క మంగళూరులో అనేక జానపద గీతాలను సేకరించారు. తరువాత జానపద గీతాలలోని కథలను గుర్తించి అనేక రచనలను చేశారు. అంబటి కృష్ణశాస్త్రి, తళికిన వెంకన్నయ్య, ఎం ఆర్ శ్రీనివాసమూర్తి, డి.యు.గుండప్ప, బి,ఎమ్ శ్రీకంఠయ్య, వి.సిషారామయ్యలు మాస్తి కథలను చదివి వాటిలోని తప్పొప్పులను సరిదిద్ది మెచ్చుకొని గొప్ప సాహితీవేత్తగా ఎదగడానికి ఎంతగానో ప్రోత్సహించారు.

ఒక మనుష్యుని మీద ప్రభావం చూపే పుస్తకాలంటే ఆ మనుష్యుని తమ అనుగ్రహంతో రక్షించిన పుస్తకాలని మాస్తే స్వయంగా చెప్పుకున్నారు. మాస్తి విషయంలో ఈ మాటలు సంపూర్ణంగా నెరవేరాయి. మాస్తికి మొదట పరిచయమైన గ్రంథం "వాల్మీకి రామాయణం" మాస్తి చిన్నవయసులో ఆయన తండ్రి ప్రతిదినం దీనిని పారాయణం చేసేవారు. మాస్తి దీని శ్లోకాలను విని అర్థంకాక పోయినా వాటిలోని మాధుర్యాన్ని అనుభవించేవారు. ధారాళంగా పుస్తకం చదివే రోజుల్లో రామాయణ సంగ్రహాన్ని చదివారు. పద్మసార, నీతి చింతామణి మాస్తిని బహుగా ఆకట్టుకున్న గ్రంథాలు. మాస్తి తాను తన తల్లికి అనేక కథలను చదివి వినిపించేవారు. చిన్నతనంలో మాస్తికి నచ్చిన కథ మా పశువు కథ . ఆ కథలోని గొల్లదొడ్డి, అందమైన యువతి, పాలసమృద్ధి, పశువుల సంభ్రమం, అడవి భయము, పులి ఆర్భాటము, తల్లి పశువు అసహాయత, దూడలగోడు, తల్లిగోవు సత్యం, పులి ఔదార్యాలను చూసి మాస్తి హృదయం ద్రవించిపోయింది. చిన్నప్పుడు తన మాస్టారు బహుమతిగా ఇచ్చిన 'అల్లా ఉద్దీన్ అద్భుతదీప', సుందరకాండలు తన జీవితంపై చెరగని ముద్ర వేశాయి. 'రఘువంశ'లోని శ్లోకాలను నిత్యం పారాయణం చేస్తూ పాడుకునేవారు. వీరి ఉపాధ్యాయులు నారాయణప్ప శ్లోకం చదివి అర్థం చెబుతుంటే మాస్తి హృదయం ఆనందంతో గంతులువేసేది. వీరేశలింగం రాజశేఖర చరిత్ర, సత్యవతీ చరిత మాస్తిని ఆకట్టుకున్నాయి. వీరు గుణమున్న ఏ సాహిత్యమైనా చదివి

సుఖించే యోగ్యత పెంచుకున్నారు.

మాస్తి తన మేనత్తతో కలిసి మహాభారతలోని అనేక పర్వాలను బ్రనప్పశాస్త్రిగారి శూరసేన చరిత్ర, శ్రీవెంకటాచార్య యుగలాంగీరు, రాధారాణి వంటి గ్రంధాలను చదివారు. బంకించంద్ర కథలు, ఛత్రపతి జీవిత చరిత్ర, జైమిని భారత, ముకుందమాల, విష్ణుసహస్రనామ వీరి నిత్యపారాయణ గ్రంధాలు. మాస్తి తన తాతగారి ప్రోత్సాహంతో నేర్చిన ఈ శ్లోకాలు వారి చైతన్యానికి నాంది అయ్యాయి.

1915లో హైస్కూలు ఉపాధ్యాయుడు సుబ్బకృష్ణయ్య మూలంగా వాల్టర్ స్కాట్, టాలీసీమన్, షేక్స్పియర్, వంటి ఆంగ్లరచయితల పరిచయం ఏర్పడింది. వీటిమూలంగా ఇంగ్లీషుభాషలోని మాధుర్యాన్ని చవిచూసి ఆంగ్లంలో రచనలు చేయాలని సంకల్పించారు. వర్డ్సవర్త్, కాలరిడ్జ్, కీట్స్, షెల్లీ, గోల్డ్స్మిత్, డికెన్స్, రష్కీ, మ్యాథ్యూ ఆర్నాల్డ్ మొదలైన ఆంగ్ల కవులు మాస్తి కవిహృదయాన్ని మేల్కొలిపారు.

**నా చైతన్యానికి రుచించిన ఈ రచనలనుండి నా జీవితం మెరుగైనది. జీవితంలో తప్పును గ్రహించి జీవితాన్ని సరైన మార్గంలో సరిదిద్దుకునేందుకు దైవజ్ఞానం పెరిగి మనస్సు నిర్మలమయ్యేందుకు సాధనాలయ్యాయి అని మాస్తి తన జీవిత చరిత్ర అయిన 'భావ' లో చెప్పుకున్నారు.**

మాస్తి యవ్వనంలో పరిచయమైన పుస్తకాలు అతని జీవనగమనాన్ని మార్చివేశాయి. హరిదాసకీర్తనలు, శివచరణ వచనాలు, తమిళ, వైష్ణవ ప్రబంధాలు, రామాయణ మహాభారత గ్రంథాలు, జైమినీ భారతం, కుమార వ్యాస భారత, హోమర్, వర్జిల్, డాంటే, గయట్, టాల్స్టాయ్, గాంధీజీ, టాగూర్‌లు రచించిన గ్రంధాలు మాస్తిపై ఎక్కువ ప్రభావం చూపాయి. సాహిత్యమేకాకుండా మతగ్రంథాలయిన బైబిలు పాత కొత్త నిబంధనలు, భగవద్గీత, ఉపనిషత్తులు, ఖురాన్, బౌద్ధ, జైన ధర్మగ్రంధాలు, రామకృష్ణపరమహంస వివేచనాత్మక రచనలు మాస్తి ఆత్మీయ జీవితానికి వెలుగునిచ్చాయి. తత్వజ్ఞానులలో మార్క్స్, ఎరీలియస్, ఎపిక్విటస్, భక్తులలో దావీదు మహరాజు (బైబిలు), అగస్టీన్‌లను మాస్తి అధికంగా అభిమానించేవారు.

నా చైతన్యానికి రుచించిన ఈ రచనలనుండి నా జీవితం మెరుగైనది. జీవితంలో తప్పును గ్రహించి జీవితాన్ని సరైన మార్గంలో సరిదిద్దుకునేందుకు దైవజ్ఞానం పెరిగి మనస్సు నిర్మలమయ్యేందుకు సాధనాలయ్యాయి అని మాస్తి తన జీవిత చరిత్ర అయిన 'భావ' లో చెప్పుకున్నారు.

మాస్తి ఆత్మ చరిత్ర 'భావ' ను చూస్తే ఆయన వ్యక్తిత్వం మన కళ్ళకు కనబడుతుంది. వీరు చాలా సున్నిత మనస్కులు. ఎలాంటి సంధర్భంలోనూ ఇతరుల మనస్సు గాయపెట్టినట్టు ఎక్కడా కనిపించదు. మాస్తి ఉద్యోగం చేస్తున్న సమయంలో అనేకులను కలిసి వారి కష్టాలను గుర్తించి తగురీతిలో సహాయపడేవారు.

ఆంగ్లంలో రచనలు ప్రారంభించిన మాస్తి కోలారుజిల్లాలో అధికారిగా ఉన్నపుడు కోలారు షాలూకా మల్లసంద్ర అనే గ్రామాన్ని సందర్శించినపుడు పేదరైతు మాటలు విన్నపుడు చలించి మాతృభాష కన్నడలోనే రచనలు కొనసాగించాలని నిశ్చయించుకున్నారు. ఒకసారి ఒక రైతు చేసిన తప్పుకు ప్రభుత్వంవారు జరిమాన విధించారు. అప్పుడు మాస్తి జిల్లా అధికారిగా ఉన్నారు. ఆ రైతును మాస్తి దర్శించినపుడు అతడు మాస్తితో తనగోడు చెప్పుకున్నాడు. మాస్తి ఆ రైతుపట్ల కనికరించి ఎందుకప్పా శిస్తు కట్టలేదు. ప్రభుత్వ రూల్సు నీకు తెలియవా అన్నప్పుడు ఆ రైతు దీనంగా సామి అవన్నీ ఇంగ్లీషులో ఉన్నాయి. నాకు ఎలా అర్థమవుతాయి అన్నాడు. అతని దీనత్వాన్ని చూసి మాస్తి చలించి ఇకనుండి ప్రతి కార్యాన్ని కన్నడంలోనే నిర్వహించాలని నిర్ణయించుకొని ఆ రీతిగా నడుచుకున్నారు. ఆ సమయంలో ఇంగ్లీషు భాష పట్ల ఉన్న వ్యామోహాన్ని విడిచి కన్నడ సాహిత్యంపై మక్కువ పెంచుకున్నారు.

మాస్తి ఏదయనా పనిని ప్రారంభించే ముందు బాగా ఆలోచించే వారు. తన పనికి ఆత్మీయులు అడ్డు వచ్చినా సర్దుకునేవారు కాదు. అప్పుడే ఎదుగుతున్న కవులను ప్రోత్సహించడమంటే మాస్తికి చాలా సంతోషం. వైయక్తికం కన్నా సమిష్టిగా పనిచేయడం మాస్తికి చాలా ఇష్టం. సమకాలీనుల సహకారంతో పేదకవుల కోసం సహకార నిధిని ఏర్పాటుచేశారు. అప్పుడప్పుడే ఎదుగుతున్న కవులకు ఇది ఎంతగానో ఉపయోగపడింది. కువెంపు గారి 'కూలలు', దారా బింద్రేగారి 'గరి', గురూరాలు రామస్వామిఅయ్యంగారి 'హళ్లియ చిత్రగళు' పు.తి. నరసింహాచారిగారి 'హణతె' లాంటి అపూర్వ కృతులన్నీ ఈ నిధి సహాయంతోనే వెలుగుచూశాయి.

గుణగ్రాహ్యత మాస్తిలోని ప్రత్యేకత. వ్యక్తి ఎవరైనా సరే వారితో కొద్దిసేపు ముచ్చటిస్తే ఆ వ్యక్తిలోని గుణగణాలను, అతని మనస్తత్వాన్ని ఇట్టే పసిగట్టేవారు. అనేక పేదవారిని ఆదుకొని వారికి సహాయం చేసేవారు. ఒకసారి మాస్తిని జి.పి.రాజారత్నం కలిసి తనకు జీవనోపాధి కల్పించవలసినదిగా కోరారు. మాస్తికున్న అధికారంతో ఏదో ఒక ఉద్యోగం ఇచ్చి ఉండవచ్చు. కానీ రాజారత్నంలో ఉండే ప్రతిభను గుర్తించి సాహిత్యరంగంలో ఎదుగుటకు అవకాశం ఇచ్చారు. హ్యూయాన్‌స్ప్యాంగ్ రచనలను

అనువదించడానికి ఒప్పించి కానుక రూపంలో జీతం ఇచ్చేవారు. మాస్తి నన్ను ఆవిధంగా ఆదరించడంతో నా జీవితం మలుపు తిరిగి బౌద్ధ సాహిత్యానికి ఆకర్షించబడ్డానని కృతజ్ఞతాపూర్వకంగా చెప్పుకునేవారు.

మాస్తికి దైవభక్తి మెండు. మాస్తికి బి.ఎ. చదివేటప్పుడు అంబిళ్ళ కృష్ణస్వామి అయ్యంగార్ గారి కుమార్తె పంకజమ్మతో పెళ్ళయింది. ఆమె అన్నివిషయాల్లో సహకరిస్తూ పతికి తగ్గ పత్నిగా ఖ్యాతి గడించింది. తనపత్ని గురించి మాస్తి తన స్నేహితులతో గర్వంగా చెప్పుకునేవారు. మాస్తి తన గతజీవితాన్ని ఎప్పుడూ మరువలేదు. తాను విద్యార్థిజీవితంలో పడిన కష్టాలు, ఇబ్బందులు పెద్ద అధికారి అయినప్పుడుకూడా జ్ఞావకం ఉంచుకొని తనలాంటివారికెందరికో ఉవకారం చేశారు. తన జీవితకాలమంతా కన్నడ సాహిత్య సేవలోనూ, ప్రజాసేవలోనూ గడిపారు. అతని అపార సేవలకు పులకించిన కన్నడ జాతి మాస్తిని తమ ఆస్తిగా చెప్పుకొని అతిశయిస్తారు.

కన్నడ కథాబ్రహ్మగా కీర్తింపబడిన మాస్తి 1929లో బెళగాంలో జరిగిన పదునైదవ సాహిత్య సమ్మేళనానికి అధ్యక్షత వహించారు. 1941లో జరిగిన అఖిలభారత సమ్మేళనానికి కన్నడ విభాగాధ్యక్షులుగా ఉన్నారు. ఈయనకు 1942లో మైసూరు మహారాజుచే 'రాజాప్రసక్త' అనే బిరుదు ప్రధానం చేయబడింది. 1946లో మద్రాసులో జరిగిన దక్షిణభారత భాషాసమ్మేళనానికి అధ్యక్షులుగా ఉన్నారు. 1956లో కర్ణాటక విశ్వ విద్యాలయం మాస్తి సేవలను గుర్తించి గౌరవ డాక్టరేటుతో సత్కరించింది. 1961లో ముంబాయిలో జరిగిన అఖిల భాంత కవుల సమ్మేళనానికి అధ్యక్షత వహించారు

1964లో ఇండియన్ పొయెట్స్, ఎస్సేయిస్ట్స్, నావలిస్ట్స్ సంస్థకు ఉపాధ్యక్షులుగా, 1976లో అధ్యక్షునిగాను పనిచేశారు. తర్వాత 1968లో అతని సన్నకథల సంపుటికి ప్రఖ్యాత సాహిత్య అకాడమి ప్రశస్తి లభించింది. 1974లో కేంద్రసాహిత్య అకాడమి వారిచే పెలోషిప్‌కు ఎంపిక అయ్యారు. 1977లో మైసూరు విశ్వవిద్యాలయం డి.లిట్ ప్రశస్తిని ప్రధానం చేసి మాస్తిని గౌరవించారు. భారత ప్రభుత్వంచే 1983లో చిక్కవీర రాజేంద్ర నవలకు భారతదేశ ప్రతిష్టాత్మకమైన జ్ఞానపీఠ పురస్కారంతో సన్మానించబడ్డారు. తిరువనంతపురంలో జరిగిన మళయాళ సమ్మేళనంలో అధ్యక్షత వహించిన సర్దార్ కె.య. ఫణిక్కర్ గారు మాస్తిని కన్నడ భీష్మాచార్యులుగా అభివర్ణించారు.

19వ శతాబ్దం చివర జన్మించిన మాస్తి 20వ శతాబ్దం పూర్వార్థంలో విస్తృతంగా రచనలు చేసి సమాజంలో ఆధునిక భావాల్ని వ్యాపింపజేసిన విశిష్ట రచయిత. వీరు జీవించిన కాలంలో ప్రాచీన సంప్రదాయం సన్నగిల్లుతూ నవ్య సంప్రదాయం అంకురించి వర్ధిల్లుతున్న సమయం. ఆ విధంగ వీరు రచనలు చేసిన కాలాన్ని ఒక సంధి యుగంగా పేర్కొనవచ్చు. ఆనాడు సమాజంలో వ్యాపిస్తున్న నూతన భావజాలమే ఆధునికంగా భావించబడింది. అది సమాజంలో ఒక రకమైన సంఘర్షణ నుంచి ఉద్భవించింది. ఆలాంటి సామాజిక నేపధ్యంలో మాస్తి రచనలు చేపట్టి ఆధునిక భావ సంపదను సుస్థిరపరచారు. కన్నడ ప్రాంతంలోని అనాటి ప్రజల జీవనశైలి, వారి ఆచారాలు, సంప్రదాయలు, సంప్రదాయాలపై ధిక్కారం వంటి అనేక అంశాలు వీరి రచనల్లో చోటు చేసుకున్నాయి. ఆనాటి సమాజంలోని సామాజిక, రాజకీయ ఆర్థిక పరిస్థితులు వీరి కథలను బట్టి తెలుసుకోవచ్చు

> ***సమాజంలో ఆధునిక భావాల్ని వ్యాపింపజేసిన విశిష్ట రచయిత. వీరు జీవించిన కాలంలో ప్రాచీన సంప్రదాయం సన్నగిల్లుతూ నవ్య సంప్రదాయం అంకురించి వర్ధిల్లుతున్న సమయం. ఆ విధంగ వీరు రచనలు చేసిన కాలాన్ని ఒక సంధి యుగంగా పేర్కొనవచ్చు.***

1910లో ఆయన బి.ఏలో చదివేటప్పుడు 'రంగనమధువె' అనే కథను రాశారు. మధురవాణి పత్రికలో ఈకథ ప్రచురింపబడింది. కన్నడిగుల జీవన విధానాన్ని కన్నులకు కట్టినట్లు వర్ణించడం ఆయనకు వెన్నతో పెట్టిన విద్య. మాస్తికంటే ముందు పంజె ముంగేశరాయ, కరూరు వాసుదేవాచార్యులు వంటి విద్వాంసులు కథలను రాశారు. కాని మాస్తి కథలలోని వినూత్నత ప్రజల్ని బాగా ఆకట్టుకున్నది.

వీరి కథల్లో సంప్రదాయాన్ని గౌరవించే స్త్రీలతోపాటు విశృంఖలత్వం ప్రదర్శించే స్త్రీలుకూడా ఉన్నారు. ఇతిహసాలలోని పాత్రలను కథావస్తువుగా తీసుకున్నారు. ఆంగ్లేయుల దృష్టిలో భారతదేశం ఎలా ఉందో కోట్నీన్ సాహెబ్ కథలోను, దుబాయిఫాదరు కథలోనూ వివరించారు. మనదృష్టిలో ఆంగ్లేయులు అన్న అంశంపై సోరలి ప్రసంగ మొదలైన కథలలో చర్చించారు. పౌరాణిక సాహిత్యం నుండి స్వీకరించిన కథాంశాలలోను ధర్మానికీ, పాలకుల పరిపాలనకూ నడిచే ఘర్షణతో కూడిన కథాంశాలు దేశాభిమానం, త్యాగాన్ని ప్రబోధించే కథలూ, దయ్యాల కథలూ, అపరాధ పరిశోధనాత్మక కథలూ, సరళ భక్తిగల కథలు, ప్రేమ, పెళ్లి కథలు మొదలైన అంశాలను వర్ణిస్తూ మానవ జీవితంలోని ప్రతి కోణాన్నీ తన కథలలో ప్రతిఫలింపజేశారు. తల్లీకూతుళ్ళ అనుబంధం, తండ్రీకూతుళ్ళ స్నేహం, అత్తాకోడళ్ళ సంఘర్షణ, దంపతుల అనురాగం, అన్యోన్యత, సంఘర్షణ, అన్నాచెల్లెళ్ళ అనుబంధం

వీరి కథల్లో కనిపిస్తాయి. శ్రీకృష్ణుడు, ఋషులు, కవులు, పండితులు, పామరులు, మాండలికులు, పల్లె జీవనం, పట్నపు జీవనం, పతివ్రతలు, వేశ్యలు, హంతకులు చివరికి కాకులు, చీమలు కూడా మాస్తి కథలలో కథావస్తువులయ్యాయి. తన పదిహేను కథాసంకలనాలలో నూరు కథలను మనోరంజకముగా రచించిన కన్నడ ఆస్థి మాస్తిగా కీర్తింపబడ్డారు. నిరాడంబరమూ, సహజము అయిన మనోహర శైలితో మాస్తి కథలు చారిత్రకంగానేగాక కళాత్మకంగా కూడా ప్రాముఖ్యత సంతరించుకున్నాయి.

వీరి కథలలో అధ్యాత్మికత కూడా అధికంగా కనిపిస్తుంది. క్రైస్తవ, జైన, బౌద్ధ మతాలను గూర్చిన చర్చతోపాటు దేవుని పట్ల మానవుని అన్వేషణ వీరి కథల్లోని ప్రత్యేకత. వీరి కథల్లో హాస్యకథలు కూడా ఉన్నాయి. వెంకటరాయ పిశాచి వంటి దయ్యాల కథలు, సంజీవయ్య అంతేకాక చారిత్రక, పౌరాణిక అంశాలు కూడ మాస్తి కథల్లో చోటుచేసుకున్నాయి . వీరి చారిత్రక కథల్లో కర్ణాటక రాజుల జీవిత చరిత్రలేకాక భారతదేశంలోని అశోకుడు, టిప్పుసుల్తాను, ఉపగుప్తుడు, వంటి ప్రముఖ రాజుల జీవితాలు కథావస్తువులయ్యాయి. అంతేగాక పాశ్చాత్య దేశ రాజుల జీవితాలేకాక ప్రముఖ సాహితీమూర్తుల జీవితంలోని ఘట్టాలు కూడా వీరి కథల్లో చోటుచేసుకున్నాయి.

**ఈయన అంతకుముందు ఎవరూ అనుసరించని నూతన కథాకథన పద్ధతలతో కథలను రచించి విమర్శకుల ప్రశంశలందు కున్నారు. మాస్తి ఉపయోగించే భాష, వివరణ, శైలి ఎంత గానో కీర్తింపబడి అనేకమందికి మార్గదర్శ కాలయ్యాయి.**

మాస్తి ప్రతి కథలోనూ మానవత్వపు ఛాయలు మనకు కనిపిస్తాయి. మానవునిలో నిద్రాణమై ఉన్న మానవత్వపు విలువలను మేల్కొలిపి అతన్ని మహనీయునిగా తీర్చిదిద్దే ప్రయత్నం చేశారు. మాస్తి తన కథలలో పురుష పాత్రలను ఆదర్శవంతులుగా తీర్చిదిద్దారు. స్త్రీలు తప్పు చేసినా మానవత్వంతో క్షమించి ఆదరించాలనే ప్రబోధం ఈయన కథలలో కనిపిస్తుంది. మానవులలో జీవకారుణ్యం పెంపొందించడానికి కాకలోక, ఇరువుగళలోక, కల్మాడియకోణ వంటి కథలని రాశారు. తమకంటే గుణవంతులుగా ఉంటే మనుషులకి వాడి మీద ద్వేషం. పక్షులలో కూడా మనుషులలాగే ఉండవచ్చు. కాకలోక కథలో అందవికారంగా ఉన్న కాకులు అందంగా, ఆహ్లాదపరిచే చిన్న పక్షిపిల్లలను చూసి ఓర్వలేక చంపేస్తాయి. మానవులలో జీవకారుణ్యం పెంపొందించి మానవత్వాన్ని మేల్కొల్పాలనే తపన మాస్తి కథలలో కనిపిస్తుంది. మానవుని సర్వ శక్తి, స్వాతంత్ర్యాలను పరమ ప్రమాణంగా భావించి అతని ధార్మిక, వైజ్ఞానిక, కళాత్మక, ఆధ్యాత్మిక రంగాల వికాసానికి, సంఘశ్రేయస్సు ప్రధాన ధ్యేయంగా మస్తి షెన కథలను రాశారు. మంత్రోదయ, మాయణ్ణన కన్నడి, ఒందిహాళియ కతె, ఇన్నొందు హాళియకతె వంటి కథలలో మానవుడు ఆధ్యాత్మికంగా ఎదగాలని అప్పుడే మానవత పరిమళిస్తుందని ప్రబోధించారు. బీదియల్లి హోగువనారి, దురదృష్టదహెణ్ణు వంటి కథలలో స్త్రీల మనసు నెరిగి మానవత్వంతో వారి అభ్యున్నతికి పాటుపడాలని ఆకాంక్షించారు.

అన్ని మతాలు, కులాలకంటే మానవత్వం గొప్పదని శాలియ ఆచార్యరు, దుబాయిపాద్రియ ఒందుపత్ర, ఆచార్యవంత అయ్యంగారు వంటి కథలలో చూపించారు. భార్యాభర్తలలో ఎవరు తప్పు చేసినా మానవత్వంతో ఒకరినొకరు క్షమించువాలనే ప్రబోధం నళినియ తందె, ఆంగ్లనౌకా కెప్టెన్, వెంకటిగన హెండితి, కథలలో కనిపిస్తుంది. మానవత్వపు సువాసనలు పరిమళిస్తూ జాతిని జాగృతం చేయాలన్న ప్రయత్నం మాస్తి ప్రతి కథలోనూ ప్రతిబింబిస్తుంది. ఈ మానవత్వం పరిమళించాలంటే మనిషి మానసికంగానూ, ఆధ్యాత్మికంగానూ ఎదిగి క్షమాగుణం అలవరచుకోవాలని మాస్తి తన కథలద్వారా ప్రబోధించారు.

రచయిత సామాజిక దృష్టి, వాస్తవిక దృక్పథం, సంఘ సంస్కార దృష్టి, లోకజ్ఞతలను బట్టి మాస్తి కథలను సామాజిక కథలు, ఐతిహాసిక కథలు, పౌరాణిక కథలుగా కె. నారాయణరావు గారు వర్గీకరించారు

సూక్ష్మంగా పరిశీలిస్తే మాస్తి కథలను కుటుంబ జీవిత కథలు, ప్రణయ కథలు, అవహేళనాత్మక కథలు, స్త్రీవాద కథలు, పౌరాణిక కథలు, జాతీయవాద కథలు, మనవపావాద కథలు, ప్రబోధాత్మక కథలు, సంఘసంస్కార కథలు, మనోవైజ్ఞానిక కథలు, ఆధ్యాత్మిక కథలు, హాస్యకథలు, మానవతా కథలుగా వర్గీకరించవచ్చు. వీరి కథలలో ప్రధానంగా కులం, విద్య, అవినీతి, అధికార దుర్వినియోగం, స్త్రీ, బాల్య వివాహాలు, వితంతువులు,వేశ్యలు, మూఢనమ్మకాలు, ఆర్థిక సమస్యలు, భాషాసమస్య, మానవత, జాతీయత, ఆధ్యాత్మికత, చరిత్రలు కథావస్తువులుగా కనిపిస్తాయి.

ఈయన అంతకుముందు ఎవరూ అనుసరించని నూతన కథాకథనపద్ధతలతో కథలను రచించి విమర్శకుల ప్రశంశలందుకున్నారు. మాస్తి ఉపయోగించే భాష, వివరణ, శైలి ఎంతగానో కీర్తింపబడి అనేకమందికి మార్గదర్శ కాలయ్యాయి. మాస్తి కుటుంబ సభ్యులు మాస్తి వెంకటేశ అయ్యంగార్ జీవన కార్యాలయం ట్రస్టను స్థాపించి సాహిత్యాభివృద్ధికి పాటుపడుతున్నారు.



## దృశ్య మాలికలు

- బి. గోవర్ధనరావు
9441968930

ఒక దృశ్యాన్ని
చూపులతో పట్టాలనుకున్నంతలో
కళ్ళల్లో కరిగి
మదిలో మరో దృశ్యమై నిలుస్తుంది!
సాధ్యా సాధ్యాలను - జీవన నైపుణ్యాలను
ఎద మీద పెడుతుంది
మహాముని మౌన ముద్రలా
నేర్చుకోవాల్సినపుడు
నేర్చుకొమ్మనే చెబుతుంది!

ఒక దృశ్యం - తియ్యని పరవశం
ఒక దృశ్యం - అనురాగమధురం
ఒక దృశ్యం - అనుభవాల్ని ప్రోది చేస్తున్న ఆశల కలశం
ఒక దృశ్యం - కూలిపోతున్న బ్రతుకు శకలం
లోలోన రగులుతున్న తపనలకు
అంతటా పూస్తున్న దృశ్యాలే ఆలంబనలు -

దృశ్యం ఏదయినా
కొన్ని చెదరని ముద్రలేస్తాయి
మరికొన్ని విడమర్చిన కొత్త కథనాలవుతాయి
మార్పు కోరుకుంటూ



కాలమనే జ్ఞాని ముందు
వినమ్రంగా కదిలిపోతాయి -
అద్దంలాంటి అర్థాన్ని
అంకురించిన ప్రతీకలతో చూపుతాయి -
చుట్టూ వస్తున్న దృశ్యాలకు - మనిషి ఆలోచనలకు
ఒక అవినాభావ సంబంధం
నడుస్తున్న చరిత్రలా.. విడదియ్యని బంధం.!

---

## చెరువొక ఐక్యరాజ్యసమితి!

- గన్నోజు శ్రీనివాసాచారి
9490145913

చెరువు
రైతు జీవితాలకే ఆదెరువు!
చెరువులు నిండాలె
పంటలు పండాలె
చెరువులు గెల్లితేనే
పల్లె పరవశం!
సాలె ఇడిసినప్పుడు
పిల్లగాండ్ల చెరువుకట్ట మీది ఆనందం
ఇంటిముఖం పట్టిన
పసుల పిల్లల తుళ్ళింత
ఎగాదిగా చూచినా
ఎక్కడా కనిపించదేం?
లేగదూడల సిందులు
దూపారిన ఆలమందల ఆనందం
ఎవరెత్తుకెళ్ళినట్లు!



మా ఊరిచెరువు
నాకొక మరుపురాని జ్ఞాపకం!
కొంగ బావల చేపలవేట
నీటి బాతుల అలుపెరుగని ఈదులాట
కప్పతల్లుల పట్టరాని సంతోషం
బుడ్డపరకలు
కొర్రమట్టలు
తాబేళ్ళు ఎండ్రకాయలు
కలవరపెట్టే నీరుగట్టెలు
కలుపుగోలు నీటిచిత్రాలు
అబ్బా! ఆలోచించితే
చెరువొక ఐక్యరాజ్యసమితి!

# స్వీకారం

## మన ప్రపంచం




**వారం వారం వ్యాఖ్యానం**

**దుప్పల రవికుమార్**

వెల : రూ.75/- పేజీలు: 176

ప్రతులకు : 9989265444

'మన ప్రపంచం', నగటు వివేకవంతుడి ఆవేదనకు నిలువుటద్దం. విలువలనే వలువలూడి పోయిన సమాజపు నగ్నత్వానికి ప్రతిబింబం. ఇందులో శ్రీకాకుళం పట్టణ రాజకీయాల నుంచి అమెరికా దాష్టీకం వరకూ అన్నీ ఉన్నాయి. జర్నలిజం మీద మక్కువ ఉన్న రచయిత నుంచి జాలువారిన వ్యాసాలు కాబట్టి, దాదాపుగా పుస్తకంలోని అన్ని వ్యాసాలు మీడియాను స్పృశిస్తూనే ఉంటాయి. **- జి.వి.రమేష్**

## ఆకాశయానం




**కవిత్వం**

**ముకుంద రామారావు**

వెల : రూ.60/- పేజీలు: 65

ప్రతులకు : 9908347273

ఎవరూ లేని ఇంట్లో కూడా
సూర్యకాంతి ప్రసరిస్తోంది
వెలుగు నామీద పడి
నీడగా నా చిత్రాన్ని గీస్తోంది
నను పెంచి పోషిస్తున్న వారిని
పత్రాలతోను పూలతోను పండ్లతోను
పూజిస్తూనే ఉంది చెట్టు
పక్షులు వాలడానికి వీలుగా
చెట్లు పైపైకి లేస్తూనే ఉన్నాయి **- ముకుందరామారావు**

## వటపత్రశాయి




**(ఇరవై బహుమతి కథలు)**

**సింహప్రసాద్**

వెల : రూ.175- పేజీలు: 240

ప్రతులకు : 9849061668

సింహప్రసాద్ శక్తి సామర్థ్యాలు సమస్తం అద్భుతంగా కథానికను నడిపించటమే కాదు. అందరికి నచ్చేటట్లు రాయటంలో ఉన్నాయి. వీటిలో ఉపన్యాసాలుండవు. కానీ ఈ జీవితం ఇలా ఉండాలని పాఠకులు గ్రహిస్తారు. ఈ గ్రహింపు కలిగించటం గొప్ప నేర్పు.

**- కొలకలూరి ఇనాక్**

## నమ్మకాలు వమ్మవుతున్నచోట




**కవిత్వం**

**ఏలేశ్వరం వెంకటేశ్**

వెల : రూ.100/- పేజీలు: 112

ప్రతులకు : 9849487146

గోదావరిఖని తను ఉంటున్న ప్రాంతం కనుక బొగ్గు పెల్లలకు' కావ్యగౌరవం కల్పిస్తాడు. 'బాయి పనోడు' గురించి రాస్తాడు. ఆ మనిషి (అంటే గని కార్మికుడు) తన డొక్కు సైకిల్ తొక్కుకుంటూ, లోలోపల గొనుక్కుంటూ వస్తాడని మనకు పరిచయం చేస్తాడు. ఆ సైకిల్ కుప్పగా ఉన్నా అది బాయి పనివాడి ఆస్తి, గుర్తింపు చిరునామా, "నమ్మకాలు వమ్మవుతున్నచోట" అనే పేరుతో తీసుకొస్తున్న ఈ కవితా సంపుటిలో మొత్తం 53 కవితలున్నాయి.

**- డా॥ నలిమెల భాస్కర్**

## తొలి కిరణాలు




**సాహితీకిరణం సంపాదకీయాలు**

**పొత్తూరి సుబ్బారావు**

వెలం : రూ.120/- పేజీలు: 176

ప్రతులకు : 9490751681

గోరాశాస్త్రి, ఎ.ఎస్. సుబ్రహ్మణ్యం, గజ్జెల మల్లారెడ్డి వంటి ప్రముఖ సంపాదకుల సంపాదకీయాలెన్నో చదివి వాటి ద్వారా ఎంతో జ్ఞానాన్ని సముపార్జించుకున్నాను. ముఖ్యంగా బాబాయి డా॥ పొత్తూరి వెంకటేశ్వరరావు గారి సంపాదకీయాలు తప్పనిసరిగా చదివేవాడిని. వారి సంపాదకీయాల సంపుటి వ్యాసప్రభ ద్వారా ఎంతో తెలుసుకొని సొంతశైలిని ఏర్పరుచుకున్నాను.

**- పొత్తూరి సుబ్బారావు**

## అరణ్యం (కథల సంపుటి)




**సిహెచ్.వి. బృందావనరావు**

వెల : రూ.100/- పేజీలు: 114

ప్రతులకు : 9963399189

మంచికథకి కావలసిన స్పష్టత, సమగ్రత, ఏకాంశ వ్యగ్రత, క్లుప్తత వంటి కథానికాశిల్ప లక్షణాల్ని బాగా అవగతం చేసుకున్న ఉత్తమ రచయిత బృందావనరావు గారు. ఈ కారణం వలన వారి కథలన్నిటా ఈ గుణ విశేషాలు నిబిడంగా కుదురుతున్నాయి. ఇతివృత్తాన్ని వస్తుకేంద్రం వేపు సంధించటంలోనూ అద్భుతమైన నైపుణ్యం కనిపిస్తుంది.

**- విహారి**

## స్వీకారం




### భాషా సవ్యతకు బాటలు వేద్దాం (దీర్ఘ వ్యాసం)

**ఎలనాగ**

**వెల : రూ.30/- పేజీలు: 32**

**ప్రతులకు : 9963399189**

పాఠకులు తమ తెలుగు భాషను మెరుగుపరుచుకోవటానికి ఉపయుక్తంగా ఉండేలా కొన్ని ఉదాహరణల సహాయంతో విశదపరచటమే ఈ దీర్ఘవ్యాసం యొక్క ముఖ్యోద్దేశం. మనం ఉపయోగించే భాష సాధారణ సందర్భాల్లో శిష్టముగా ఉండటం అవసరం. దీన్నే శిష్ట వ్యావహారికం అంటున్నాము.

**- ఎలనాగ**




### శ్రీ ఛానెల్ - 2

**నిరంతర హాస్య - వ్యంగ్య ప్రసారాలు**

**శ్రీరమణ**

**వెల : రూ.60/- పేజీలు: 154**

**ప్రతులకు :9441373304**

సుమారు యాభై సంవత్సరాల క్రిందటి జ్ఞాపకాల పొరల్లోకి దిగి ఆ అమృతభాండాన్ని వెలికి తీశారు శ్రీరమణ. భవిష్యత్తులో తెలుగు సాహిత్య పరిశోధకులకు కూడా ఈ అంశం ఎంతో ఉపయుక్తంగా ఉంటుంది.

**- ప్రచురణకర్తలు**




### సీమ కథా తొలకరి

**వ్యాస సంపుటి**

**డా॥ తవ్వా వెంకటయ్య**

**వెలం : రూ.150/- పేజీలు: 146**

**ప్రతులకు : 9703912727**

ఈ పుస్తకంలోని వ్యాసాలన్నీ రాయలసీమ కథానిక చరిత్ర రచనను సవరిస్తున్నాయి. రాయలసీమ కథా సాహిత్య చరిత్ర రచనలో ఏర్పడిన ఖాళీని పూరిస్తున్నాయి. చరిత్రకారుల పని ఖాళీలను పూరించడమే. ఆ పని ఈ పుస్తకం చేస్తున్నది. రాయలసీమ కథానిక 1941 నుంచి మొదలైంది అనే పూర్వచరిత్రకారుల అభిప్రాయాలను సవరించి రాయలసీమలో కథానిక 1918 నాటికే పుట్టిందని ఈ వ్యాసాలు చాటి చెబుతున్నాయి.

**- రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి**




### హింస పాదు

**కథల సంపుటి**

**బమ్మిడి జగదీశ్వరరావు**

**వెల : రూ.180/- పేజీలు: 290**

**ప్రతులకు : 9989265444**

విస్తరిస్తున్న విషానికి విత్తు ఒక్కటే! అది ఈ రాజ్యం నాటిందే! ఇదేమి రాజ్యం? ఇదేమి రాజ్యం? పోలీసు రాజ్యం.. తూటాల రాజ్యం... రాజ్యాన్ని ఏలేది హింస! హింసాయుధం! హింసలేని రాజ్యాన్ని ఊహించలేం!! రాజ్యం పెంచి పోషిస్తున్న హింస... ఉద్యోగాలలోంచి కుటుంబాలలోకి జొరపడుతూ ఇంటింటా విస్తరిస్తున్న పాదే 'హింసపాదు'

**-ప్రచురణకర్తలు**




### కాలాన్ని వెనకేసిన మనిషి

**మానవ జీవన పరిణామ పదచిత్రం**

**దేవరాజు మహారాజు**

**వెల : రూ.80/- పేజీలు: 92**

**ప్రతులకు : 9908633949**

ఇది కవితో, కథో కాదు. నాటకమో, వ్యాసమో అంతకన్నా కాదు. సంక్లిష్టమైన మానవ జీవన పరిణామాన్ని అలవోకగా ఒక సృజనాత్మకతలోకి దొర్లించే యత్నం. ఒక రూపకంగా ఆవిష్కరించే ప్రయత్నం. కాలాన్ని ప్రకృతిని శ్లాఘిస్తూనే వాటిని తన ఆధీనంలోకి తీసుకున్న మానవుడి సాహసాన్ని సంఘర్షణను ఔన్నత్యాన్ని చిత్రించే యత్నం.

**- రచయిత**




### చిగురించే మనుషులు

**కథలు**

**పలమనేరు బాలాజి**

**వెల : రూ.100/- పేజీలు: 167**

**ప్రతులకు :9440995010**

అతను కథా వస్తువుల కోసం ఎక్కువ దూరం పోనవసరం లేకపోయింది. ఇంకా చెప్పాలంటే పలమనేరు పొలిమేరలే వదలలేదు. సమాజమంతటా కమ్ముకున్న ఈ పొగను పలమనేరు గాలిలోంచే పసిగట్టగలిగాడు. ఒక్క పలమనేరునే గ్రామాలన్నిటికీ సంకేతంగా మార్చగలిగాడు.

**- వాడ్రేవు వీరలక్ష్మీదేవి**

## గురజాడ ఫౌండేషన్ పురస్కారాలు



విజయనగరం సాహితీస్రవంతి ఆధ్వర్యంలో గురజాడ స్వగృహంలో జనవరి 4న గురజాడ స్ఫూర్తి రత్న పురస్కార సభ జరిగింది. గురజాడ ఫౌండేషన్(యుఎస్ఎ) వారు కారా మాష్టారు, వెలుగు రామినాయుడులకు పురస్కారాలను అందజేశారు. సాహితీస్రవంతి కన్వీనరు చీకటి దివాకర్ మాట్లాడుతూ మాష్టారు నిర్వహిస్తున్న కథానిలయం తెలుగు జాతికి వెలుగు బాట అని వర్ణించారు. గురజాడ వంశీయులు రవీంద్ర, ఇందిర, ప్రసాదు తదితరులు గురజాడ ఫౌండేషన్ సేవలను వివరించారు. ఫౌండేషన్ స్థాపకులు అరుణ గురజాడ, గోపాలకృష్ణలు సెల్‌ఫోన్ ద్వారా సందేశాన్ని వినిపించారు. సీనియర్ కథారచయిత అట్టాడ అప్పల్నాయుడు, రెడ్డి రామకృష్ణ సభలో ప్రసంగించారు. వెలుగు రామినాయుడు స్పందిస్తూ కార్యక్రమాలు నిర్వహించడంలో గురజాడ స్ఫూర్తి వెన్నంటి నడిపిస్తుందని అన్నారు. కారా మాష్టారు మాట్లాడుతూ ప్రజాస్వామ్య స్ఫూర్తితో కథానిలయంలో అన్ని రకాల రచనలను అందుబాటులో ఉంచామని, వాటిని అందరూ వినియోగించుకొనవలసిందిగా కోరారు. ఇందిర గారి వందన సమర్పణతో సభ ముగిసింది.

## వట్టికోట ఆళ్వారుస్వామి సంస్మరణ సభ



బాగ్‌లింగంపల్లిలోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో సాహితీస్రవంతి నగర కమిటీ ఆధ్వర్యంలో డిసెంబరు 30న వట్టికోట అళ్వార్‌స్వామి శతజయంతి సాహితీ సమాలోచనం - జనకవనం జరిగింది. ఈ సందర్భంగా పి.ఎన్.మూర్తి రాసిన 'సుజనులారా' పుస్తకాన్ని ఆచార్య కొలకలూరి ఇనాక్ ఆవిష్కరించారు. ఈ పుస్తకంలో సమాజానికి అవసరమైన మంచి చెడులను రచయిత విడమరిచి చెప్పారని ఆయన పేర్కొన్నారు. ముఖ్య అతిథి జస్టిస్ చంద్రకుమార్ మాట్లాడుతూ మతమౌఢ్యాలను పారద్రోలే రచనలు రావాలని అన్నారు. సాహితీ స్రవంతి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి కె. ఆనందాచారి ప్రధాన ప్రసంగం చేస్తూ సమాజం బాగు కొరకు వట్టికోట అళ్వార్ స్వామి తన జీవితాన్ని అంకితం చేశారని తెలిపారు. 'ప్రజల మనిషి' నవల ఆనాటి ప్రజల జీవితాన్ని వాస్తవిక కోణంలో చిత్రించిందని అన్నారు. అళ్వార్ స్వామి చూపిన బాటలో అందరం నడవడమే ఆయనకు మనమిచ్చే ఘనమైన నివాళని అన్నారు. సీనియర్ సాహిత్యవేత్త మోతుకూరి నరహరి మాట్లాడుతూ గ్రంధాలయాల అభివృద్ధికి అళ్వార్ స్వామి ఎనలేని కృషి చేశారని అన్నారు. ఈ కార్యక్రమానికి సాహితీ స్రవంతి నగర కమిటీ అధ్యక్షులు తంగిరాల చక్రవర్తి సభాధ్యక్షులుగా వ్యవహరించారు. దాదాపు 30 మంది కవులు జనకవనంలో పాల్గొన్నారు. బిక్కి కృష్ణ, భూపతి వెంకటేశ్వర్లు సాహితీస్రవంతి నగర కమిటీ ప్రధాన కార్యదర్శి జి.యాదగిరి రావు, కమిటీ సభ్యులు జి. నరేశ్, ఎ. మోహన్‌కృష్ణ, కవులు, రచయితలు, సాహిత్యాభిమానులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.



పి.యన్. మూర్తి రచన 'సుజనులారా' ఆవిష్కరణ

## రాచపాళెంకు అభినందన




జనవరి 10న కర్నూలులో జనవిజ్ఞాన వేదిక ఆధ్వర్యంలో 'సైన్సు-సమాజం-సంస్కృతి' అంశంపై సదస్సు జరిగింది. ఈ కార్యక్రమంలో ముఖ్య వక్తగా రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి పాల్గొన్నారు. కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు పొందిన సందర్భంగా రాచపాళెంను ఈ వేదికపై సాహితీ స్రవంతి తరపున సత్కరించారు. సాహితీ ప్రేమికులందరినీ మిత్రమా అని ప్రేమగా పిలిచే రాచపాళెం సీమ సాహితి ముఖచిత్రమని వక్తలు అన్నారు. సాహితీస్రవంతి రాష్ట్ర కార్యదర్శి జంధ్యాల రఘుబాబు, జిల్లా కార్యదర్శి కెంగార మోహన్, ఇనాయ్‌తుల్లా, ఎస్‌డివి అజీజ్, వెంకటకృష్ణ, సురేష్, డా. జయరాం, జె.వి.వి. రాష్ట్ర అధ్యక్షులు డా. రంగన్న, రాష్ట్ర నాయకులు రఘునాథ్ రెడ్డి, జిల్లా నాయకులు సుధీర్ రాజు, విజయకుమార్ తదితరులు పాల్గొన్నారు.

## కవి స్వరం - ఒక వినూతన ప్రక్రియ



ఏ ఉపోద్ఘాతాలు, నేపథ్యాలు, వాఖ్యానాలు లేకుండా ఒక కవి తన కవితలతో ఒక గంటసేపు వినిపించి శ్రోతల్ని అనుభూతి ధారలోకి తీసుకువెళ్ళగలడా? అనే ఆలోచనతో కాకినాడ సాహితీస్రవంతి ఆధ్వర్యంలో డిసెంబర్ 29న 'కవి స్వరం' పేరుతో ఒక కవితా పఠన సభ జరిగింది. దీనికి శ్రీనియోగి హైదరాబాద్ నుండి వచ్చి శ్రోతల ముందు ఒక గంట సేపు తన కవితల్ని వినిపించారు. ఏ ఇతరమైన అంశాలు లేకుండా సభలోని కవులు, రచయితలు, సాహితీ సహృదయులు లీనమై విన్నారు. శ్రీనియోగి ప్రతి పదమూ, శ్రోతలు స్పష్టంగా అవగాహన చేసుకునేలా, మంచి కంఠస్వరంతో భావస్ఫూర్తి కలిగేలా చదివారు. శ్రీనియోగి కవితలు చదివి ముగించిన అనంతరం శిరీష, వద్దిపర్తి రామకృష్ణ, వి.యస్.ఆర్.ఎస్. సోమయాజులు, మణిబాబు, శ్రీనివాస్, వుయ్యూవు హనుమంతరావు, పి.పద్మజ వాణి తమ అనుభూతులను వివరించారు. శ్రీనియోగి కవితల్లో ముగింపు గొప్పగా ఉందనీ, చదివే విధానం వచన కవితా పఠనానికి ఔన్నత్యాన్నిచ్చిందనీ ప్రశంసించారు. మామూలు వచనంలా ఉన్న పంక్తులు ఉండటం అనుభూతిని అడ్డగించకపోయినా, యింకా చిక్కగా ఉంటే, ఎక్కువ స్పందనలు కలిగిస్తాయనీ సోదాహరణంగా చెప్పారు. 'కవి స్వరం' లోని ప్రయోగ విశిష్టత గూర్చి, అధ్యక్షత వహించిన ప్రముఖ కవి అద్దేపల్లి రామమోహనరావు తొలిపలుకుల్లో వివరించారు. ఈ ప్రక్రియ వల్ల అచ్చమైన కవితానుభూతి కవిలో, శ్రోతల్లో ఏకధారగా ప్రవహిస్తుందనీ, కవితో పాటు, శ్రోతలకు కూడా శిల్పలక్షణాలు స్పష్టంగా తెలిసే అవకాశం కలుగుతుందనీ చెప్పారు. అంతేగాక కవిత్వంలో అక్కడక్కడ వచనత్వం ఉండడం తర్వాత వచ్చే ఆలోచనల్లో ఒక్కొక్క చోట సముచితమే అనిపిస్తుందని కూడా పేర్కొన్నారు. గనారా వందన సమర్పణతో సభ ముగిసింది.

## సాహిత్య హేల



కాకినాడలో గాంధీభవన్‌లో జనవరి 4న జరిగిన సాహిత్య హేల కార్యక్రమంలో రావు కృష్ణారావు కథల సంపుటి 'బతుకు పోరు' పై సమీక్ష జరిగింది. అద్దేపల్లి రామమోహనరావు, బి.యస్. ప్రకాశ్, సుభాష్‌లు కథలను విశ్లేషిస్తూ మాట్లాడారు. హాస్యభరితం, వ్యంగ్య కథనంతో రావు కృష్ణారావు కథలు ఆసక్తి రేపుతాయని వక్తలు అన్నారు. అనంతరం 'జ్ఞాపకాలు' అంశంపై కవితా గోష్ఠిలో గరికపాటి మాష్టారు, గడల శివప్రసాద్, మణిబాబు, జోగి మహంతి, మద్దాలి సత్యనారాయణ, తురగా అవినాష్, మూర్తి, శిరీష, మేడిశెట్టి శ్రీరాములు పాల్గొన్నారు. గనారా వందన సమర్పణతో సభ ముగిసింది.

## శాస్త్రీయ భావాలు పెంపొందించాలి



పాలకులే మూఢ నమ్మకాలను ప్రజల్లో పెంచిపోషిస్తున్నారని జనవిజ్ఞాన వేదిక నాయకులు కె.ఎల్ కాంతారావు అన్నారు. సుందరయ్య విజ్ఞాన కేంద్రం షోయబ్‌హాల్‌లో సాహితీ స్రవంతి నగర కమిటీ ఆధ్వర్యంలో "విశ్వాసాలు-నమ్మకాలు" అనే అంశంపై సదస్సు, జనకవనం నిర్వహించారు. కార్యక్రమానికి హాజరైన కెఎల్. కాంతారావు ప్రసంగిస్తూ.. నేడు సమాజంలో మూఢనమ్మకాలు, అంధ విశ్వాసాలు వాస్తవాలుగా చిత్రిస్తున్నారని అన్నారు. సైన్సును కూడా మరుగున పడేసేందుకు ప్రభుత్వాలు పూనుకుంటున్నాయని ఆందోళన వ్యక్తం చేశారు. శాస్త్రవేత్తలు సైతం మూఢవిశ్వాసాల్లో కూరుకుపోతున్నారని, శాస్త్ర సాంకేతిక కేంద్రాల్లో పూజలూ, జంతుబలి లాంటివి జరగడం దురదృష్టకరమని అన్నారు. ఈ చర్యలు దేశానికి అత్యంత ప్రమాదకరమని హెచ్చరించారు. ఈ కార్యక్రమానికి తంగిరాల చక్రవర్తి అధ్యక్షత వహించారు. జనకవనాన్ని నగర కమిటీ సభ్యులు ఎ.మోహన్‌కృష్ణ నిర్వహించారు. నగర ప్రధాన కార్యదర్శి జి.యాదగిరిరావు, నగర కమిటీ సభ్యులు టి.వెంకట్, ఉపాధ్యక్షులు గేరా, మౌనశ్రీ మల్లిక, మాధవి, విజయలక్ష్మి, దాసు, బిక్కి కృష్ణ తదితరులు పాల్గొన్నారు.




కడపలోని సిపిబ్రౌన్ శాస్త్రి మెమోరియల్ హాలులో జనవరి 11న జరిగిన అలవరి పిచ్చయ్య రాసిన 'జీవితం ఓ సమరం' పుస్తకావిష్కరణ. చిత్రంలో మల్లెమాల వేణుగోపాల్ రెడ్డి, అబ్బిగారి రాజేంద్రప్రసాద్, అలపర్తి పిచ్చయ్య చౌదరి, ఆంధ్రప్రదేశ్ శాసనమండలి డిప్యూటీ ఛైర్మన్ ఎస్.వి. సతీష్ కుమార్ రెడ్డి, వైవియు ఉపకులపతి ఆచార్య శ్యాంసుందర్, నారాయణ, విజయభాస్కర్, మల్లిఖార్జున రెడ్డి తదితరులు ఉన్నారు.



విజయవాడలో డిసెంబర్ 21న మల్లె తీగ-రమ్యభారతి సాహిత్య వేదికల ఆధ్వర్యంలో చలపాక ప్రకాష్ కథా సంపుటి 'జీవితం' ఆవిష్కరణ సభ. చిత్రంలో గొన్నాభత్తుల మల్లేశ్వరావు, సోమేపల్లి వెంకటసుబ్బయ్య, వెలమల సిమ్మన్న, వేదగిరి రాంబాబు, జి.వి.పూర్ణచంద్, చలపాక ప్రకాష్, జలదంకి ప్రభాకర్, కలిమిశ్రీ ఉన్నారు.



విశాఖపట్నంలో విశాఖ రచయితల సంఘం ఆధ్వర్యంలో డిసెంబర్ 21న అంగర సూర్యారావు రచన 'విశాఖ నగర చరిత్ర' పుస్తకాన్ని ఆవిష్కరించిన అద్దేపల్లి రామమోహనరావు. చిత్రంలో దేవరకొండ మాధవరావు, రామతీర్థ, అడపా రామకృష్ణ, ఏ.వి.ఆర్. మూర్తి, రచయిత అంగర సూర్యారావు తదితరులు ఉన్నారు.



హైదరాబాద్‌లో మియాపూర్‌లో గల శ్రీ సాయి హోలిస్టిక్ హాస్పిటల్స్ ప్రాంగణంలో డిసెంబర్ 21న ఆలూరి విజయలక్ష్మి రచించిన 'ప్రత్యూష పవనం' ఆవిష్కరించిన డా॥ జయప్రకాష్ నారాయణ. చిత్రంలో వాడ్రేవు చినవీరభద్రుడు, కె.బి. లక్ష్మి, గీతారామస్వామి, ఆలూరి విజయలక్ష్మి, డా॥ ప్రతిపాక మోహన్ తదితరులు



ప్రకాశం జిల్లా మార్కాపురంలోని ప్రెస్‌క్లబ్‌లో డా॥ కొండేపోగు.బి. డేవిడ్ లివింగ్‌స్టన్ వెలువరించిన 'ఆకుపచ్చని లోకం' పర్యావరణ కవిత్వం సంపుటిని ఆవిష్కరించిన సీనియర్ పాత్రికేయులు మల్లిక్. చిత్రంలో కప్పగంతుల మధుసూన శాస్త్రి, కె.వి. రమణారెడ్డి, మంత్రి కృష్ణమోహన్, అన్నపరెడ్డి వీరారెడ్డి, డా. నాగేళ్ళ ఏవియా ప్రభృతులు ఉన్నారు.



జనవరి 5 న హైదరాబాద్ కళాసుబ్బారాయ కళావేదిక లో జి.వి.ఆర్. ఆరాధన కల్చరల్ ఫౌండేషన్ నిర్వహించిన కార్యక్రమంలో పొత్తూరి సుబ్బారావు రచించిన 'సంస్కర్తలొస్తున్నారు జాగ్రత్త' కథల సంపుటి ఆవిష్కరణ సభ. చిత్రంలో పి. విజయబాబు, పొత్తూరి జయలక్ష్మి, కళావేంకటదీక్షితులు, తిరునగరి, నూతలపాటి సాంబయ్య, రమణ వెలమకన్ని, పోతుకూచి సాంబశివరావు, గుదిబండి వెంకటరెడ్డి తదితరులు ఉన్నారు.




అరసం, జిల్లాశాఖ, ఆధ్వర్యంలో గుంటూరులో జరిగిన 'కథాస్రవంతుత్సవం'లో 'కథాస్రవంతి' సీరిస్ 10 -కథా రచయితలు, 10 కథా సంపుటాలు ఆవిష్కరిస్తున్న ప్రముఖ రచయితలు వల్లూరు శివప్రసాద్, కనపర్తి స్వర్ణలత, సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి, డా॥ మధురాంతకం నరేంద్ర, పి. సత్యవతి, అల్లం రాజయ్య, డా॥ వి. చంద్రశేఖరరావు, కుప్పిలిపద్మ, డా॥ రాచపాళెం చంద్రశేఖర రెడ్డి, మేడిపల్లి రవికుమార్, పినిశెట్టి, సింగంనేని నారాయణ, రెయిన్‌బో‌ప్రింట్ ప్యాక్ నరేంద్ర, పెనుగొండ



నిజామాబాద్‌లో జరిగిన ఇందూరు అపురూప అవార్డ్స్ - 2014 ప్రదానోత్సవ కార్యక్రమం. పురస్కార గ్రహీతలు ఎడమ నుండి కుడికి నెల్లుట్ల రమాదేవి (వ్యాఖ్యాత, అభినందన సంపాదకురాలు) పి. జయలక్ష్మి (నాట్యం), వి. శాంతిప్రబోధ (నవలారచన), అబుల్‌హసన్ (సంఘసేవ), బైస దేవదాసు (జర్నలిజం), యం.నారాయణరెడ్డి (మహిళాభ్యుదయం), అమృతలత (పురస్కార ప్రదాత), రావు బాలసరస్వతీదేవి (ముఖ్యఅతిథి), అంపశయ్యనవీన్ (విశిష్ట అతిథి), ఎనిశెట్టి శంకర్ (అభినందన సంపాదకుడు), ఎ.సూర్యప్రకాశ్ (కవిత్వం), శ్రీపాద కుమారశర్మ(నాటకరంగం), తుర్లపాటి లక్ష్మి (కథా రచన), టేక్మల్ విజయలక్ష్మి (గానం), కళాలలిత (వ్యాఖ్యానం), కిరణ్‌బాల (అభినందన సంపాదకులు)



## శాంతినారాయణ కథల ఆవిష్కరణ

అనంతపురంలోని ఆర్డీటి ఎకాలజీ సెంటర్‌లో జనవరి 4న శాంతినారాయణ కథా సంపుటాలు 'పల్లేరు ముళ్ళు, కొండచిలువ కోరల్లో' ఆవిష్కరణ సభ జరిగింది. ఈ సభలో రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి, గోరేటి వెంకన్న, సింగమనేని నారాయణ, బండి నారాయణస్వామి, అనంతపురం జిల్లా పరిషత్ ఛైర్మన్ డి.చమన్‌సాబ్, ఖాదర్ మొహిద్దీన్, వేదగిరి రాంబాబు, చిలుకూరి దేవపుత్ర తదితరులు పాల్గొన్నారు. ఈ సంపుటాలలోని కథలన్నీ సమకాలీన సమాజానికి దర్పణం పడతాయని ప్రాంతీయ అస్తిత్వ అవసరాన్ని చాటుతాయని వక్తలు అన్నారు. విమలాశాంతి సాహిత్య సాంఘిక సేవా సమితి వారు నిర్వహించిన కవితల పోటీల్లో గెలుపొందిన యువరచయితలకు అతిథులు జ్ఞాపికలు అందించారు. కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు పొందిన రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డిని ఈ వేదికపై సత్కరించారు. ఈ సభలో జూపల్లి ప్రేమ్‌చంద్, ఆకుల రఘురామయ్య, డా. వి.ఆర్. రాసాని, నాయిని కృష్ణమూర్తి, పాలగిరి విశ్వప్రసాద్, వేంపల్లి షరీఫ్, ఇనాయతుల్లా, పినాకపాణి, డా॥ రాధేయ, మల్లెల నరసింహమూర్తి, డా॥ రమేష్‌నారాయణ, కెరె జగదీష్, సడ్లపల్లి చిదంబర రెడ్డి, డా॥ షమీవుల్లా, అప్పిరెడ్డి హరినాథరావు, కోగిర జయచంద్ర, తోట నాగరాజు, యస్. గిరిప్రసాద్‌రాయ్ తదితరులు పాల్గొన్నారు.

# అంపశయ్య నవీన్ గ్రంథాల ఆవిష్కరణ



ప్రముఖ రచయిత అంపశయ్య నవీన్ పుట్టిన రోజును పురస్కరించుకొని హనుమకొండలోని కాకతీయ హరిత హోటల్‌లో డిసెంబర్ 24న ఆయన రచనల ఆవిష్కరణ, నవలా పురస్కార ప్రదానోత్సవ సభ జరిగింది. అంపశయ్య నవీన్ లిటరరీ ట్రస్ట్ ఆధ్వర్యంలో జరిగిన ఈ కార్యక్రమానికి నాగిళ్ళ రామశాస్త్రి అధ్యక్షత వహించారు. 'యే వెల్లులకీ ప్రస్థానం' నవలను కె.వి. రమణాచారి, 'చెదిరిన స్వప్నాలు' నవలను బి. పాపారావు, 'స్నిగ్ధ ఛాయ' నవలను చుక్కా రామయ్య ఆవిష్కరించారు. నవలలను దర్భశయనం శ్రీనివాసాచార్య, గిరిజా మనోహరబాబు, కె.పి. అశోక్ కుమార్‌లు పరిచయం చేసారు. అనంతరం డా॥ ధేనుకొండ శ్రీరామమూర్తికి నవలా పురస్కారం ప్రదానం చేసి సత్కరించారు. అంపశయ్య నవీన్ స్పందన ప్రసంగం చేశారు. చలనచిత్ర దర్శకుడు ప్రభాకర్ జైనీ అంపశయ్య నవలను సినిమాగా రూపొందించడం కోసం కొన్ని దృశ్యాల షూటింగ్‌ను ప్రారంభించారు. పద్మశ్రీ నేరెళ్ళ వేణుమాధవ్ దంపతులు, రామా చంద్రమౌళి, వి.ఆర్. విద్యార్థి, నమిలికొండ బాలకిషన్ రావు, డా. విజయమోహన్‌రావు, డా. కోదండరామారావు, వి.ఎల్. నరసింహారావు, పొట్లపల్లి ధరణీశ్వరరావు, పొట్లపల్లి శ్రీనివాసరావు, ఆచార్య బన్న అయిలయ్య, ఆచార్య ఎం. రాజేశ్వర్, డా॥ విజయకుమార్, డా. జానకి, ఆచార్య జి. దామోదర్, కె. దామోదర్‌రావు తదితరులు ఈ సభలో పాల్గొన్నారు.

# చాసో వర్ధంతి సభ




విజయనగరం సాహితీస్రవంతి ఆధ్వర్యంలో గురజాడ స్వగృహంలో జనవరి 2న చాసో వర్ధంతి సభ జరిగింది. వేదవల్లి గీతాలాపనతో మొదలైన సభలో నాగరాజు మాట్లాడుతూ నిరాడంబర జీవితాన్ని గడిపిన చాసో కథా నిపుణుడని అన్నారు. ఎవరిని హేళన చేయాలో, ఎవరిని గౌరవించాలో చాసో కథలు తెలుపుతాయని అన్నారు. ఈ సందర్భంగా ఎల్.ఆర్.స్వామిని అభినందిస్తూ రామతీర్థ మాట్లాడారు. దక్షిణ భారతీయ భాషల్లో ఎల్.ఆర్. స్వామి ఎంతో ఉన్నతమైన సాహిత్యాన్ని మనకు తెలుగులో అందించారన్నారు. స్వామి మాట్లాడుతూ భవిష్యత్ చిత్రపటాన్ని చాసో తన కథల్లో ఆవిష్కరించాడని అన్నారు. ఈ సభలో చాగంటి తులసి చాసో విశిష్టతను, స్వామి రచనల తీరును వివరించారు. పి.యస్.శ్రీనివాసరావు సభాధ్యక్షత వహించగా, చీకటి దివాకర్ ఆహ్వానం పలికారు. కృష్ణారావు వందన సమర్పణ చేయగా, జనకి గారి పాటతో సభ ముగిసింది.



**డిసెంబరు 28న మెదక్ జిల్లా సిద్ధిపేటలో జరిగిన 'అక్షర సేద్యం' పుస్తకావిష్కరణ. చిత్రంలో (ఎడమ నుండి కుడికి) సిరిసిల్ల గఫూర్ శిక్షక్, యాదవ రెడ్డి, పుస్తక రచయిత బైతి దుర్గయ్య, గాజోజు నాగభూషణం, పర్కపెల్లి యాదగిరి, ఆచార్య జయధీర్ తిరుమలరావు, కొండి మల్లారెడ్డి.**

# కలేకూరి ప్రసాద్ (యువక) స్మారక సాహితీ అవార్డు

'యువక' పేరుతో కవిత్వం, గేయం రాసిన ప్రఖ్యాత రచయిత, అనువాదకుడు కలేకూరి ప్రసాద్ స్మారక సాహిత్య పురస్కారం కొరకు వచన కవితా సంపుటాలను ఆహ్వానిస్తున్నట్లు డాక్టర్ మొగిలి దేవప్రసాద్ ఒక ప్రకటనలో తెలిపారు. 2009 సంవత్సరం నుండి డిసెంబర్ 2014లోపు ప్రచురించిన కవితా సంపుటులు ఈ పోటీకి పంపవలసిందిగా కోరారు. మూడు ప్రతులను మిరియం అంజిబాబు, ప్రచార కార్యదర్శి, బహుజన రచయితల వేదిక, డో.నెం. 35-2-3ఇ, కేశవస్వామి పేట, 3వ అడ్డరోడ్డు, ఒంగోలు- 523 001, ప్రకాశం జిల్లా చిరునామాకు పంపించవలసిందిగా కోరారు. చివరి తేదీ: మార్చి 30. ఇతర వివరాలకు 9848187416, 9030748819 ద్వారా సంప్రదించవచ్చును.

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,

# ముఖ్దూం మొహిద్దీన్

**04.02.1908 - 24.08.1969**



హైదరాబాద్‌లో సీనియర్ కమ్యూనిస్టు నాయకుడు.
తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటానికి తోడు నిలిచిన యోధుడు
ప్రసిద్ధ ఉర్దూ కవి, వక్త

SHAITYA PRASTHANAM RNI NO.APTEL/ 2004/18396 Postal Regd. No.H/SD/415/13-15
Date of Positng : 30.01.2015 . Date of Publication: 25.01.2015

PRSVMODA156

# ప్రజాశక్తి బుక్‌హౌస్ తాజా ప్రచురణలు




వెల : రూ.200/-




వెల : రూ.150/-




వెల : రూ.40/-




వెల : రూ.60/-




వెల : రూ.200/-




వెల : రూ.125/-




వెల : రూ.175/-




వెల : రూ.120/-




వెల : రూ.120/-




వెల : రూ.120/-



## సాహిత్య ప్రస్థానం తెలుగు సాహిత్య మాసపత్రిక

సాహిత్య
# ప్రస్థానం

సంవత్సర చందా కేవలం- రూ.120/- మాత్రమే

తెలుగు సాహిత్య కృషిని ప్రోత్సహించండి! తెలుగు భాషా వికాసానికి మీ వంతు సహకరించండి!

వివరాలకు: సాహిత్య ప్రస్థానం, ప్లాట్ నెం.21/1, యం.హెచ్. భవన్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర,
ఆజామాబాద్ ఇండస్ట్రియల్ ఏరియా, హైదరాబాద్- 500 020, ఫోన్: 040-27668861, సెల్: 9490099059
Email- ssprasthanam@gmail.com

www.prasthanam.com
ప్రస్థానం వెబ్‌సైట్‌ను
తప్పక చూడండి!

ప్రత్యేక తగ్గింపు
5 సంవత్సరాల చందా: రూ .600 -100: 500/- మాత్రమే
10 సంవత్సరాల చందా: రూ.1200-200 : 1000/- మాత్రమే
5,10 సం॥ల చందా కట్టిన వారికి అత్యంత విలువైన పాత ప్రస్థానం సంచికలు ఉచితం!
ట్రాన్స్‌పోర్టు ఛార్జీలు అదనం

If Un delivered please return to: Prasthanam, C/o M.H. Bhavan, Plot No. 21/1,
Near RTC Kalyana mandapam, Azamabad, Hyderabad - 500 020. Ph: 040- 27660013, Cell: 9490099059



| మనసు ఫౌండేషన్ |
| --- |
| పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
| --- | --- |
| పుస్తకం సంఖ్య | PRSVMO2A156 |
| పుస్తకం పేరు | చోషణం |
| తారీఖు | 25-5-24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | K Daveed |
| పేజీలు విడదీసినది | K Daveed |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు పరిచూపినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | GOOD |